# సమాలోచన



## జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 3 రాజమహేంద్రవరము 16-1-1980 సంచిక 6



—* ఈ సంచికలో *—



1—2—1980 సంచికలో ఏకవీర - ఇతివృత్త పరిశీలన, సౌందరనందము - సాహితీ తీర్థము, హనుమన్నాటకము - అంగదుఁడు, శ్రీకృష్ణ నిర్యాణం ఒక ఎలజీ మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా
సంవత్సరమునకు రు 10-00.
అర్థసంవత్సరమునకు రు 5-50.

సంక్రాంతి సంచిక

విడిప్రతి 50 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ ఖులుసు సీతారామశాస్త్రి

సంపుటము 3 | రాజమహేంద్రవరము 16-1-1980 | సంచిక 6

# బాలసాహిత్యం - సంక్షిప్త వివరణ

— రత్నశ్రీ (యస్. రాజశేఖర్, బి. ఏ.)

బాలసాహిత్యం అనగానే రెండు విషయాలు గుర్తుకు వస్తాయి. 1. బాలల కోసం పెద్దలు చేసిన రచనలు. 2. బాలలే, తమకోసం తాము వ్రాసుకున్న రచనలు.

ఆంధ్ర సాహిత్యంలో 'బాలసాహిత్యానికి' ప్రత్యేకస్థానం ఉంది. ప్రాచీన కాలం నుంచీ తెలుగుదేశంలో బాల బాలికల కోసం ఉద్దేశింపబడిన సారస్వతం ప్రచారంలో ఉంది ఆంధ్రసాహిత్యంలో ఎన్ని ప్రక్రియ లున్నాయో, బాలసాహిత్యం'లో కూడా అన్ని ప్రక్రియలూ ఉన్నాయి. బాల గేయాలు, కథలు, కథానికలు మొదలైనవి.

బాలసాహిత్యం గురించి వ్రాసేటపుడు ముఖ్యంగా ఒక విషయం వ్రాయాలి. కొంత మంది రచయితలలోను, కవులలోను, 'ప్రౌఢసాహిత్యానికి బాలసాహిత్యం 'సంగ్రహరూపం' అనే అభిప్రాయం ఉంది. ఈ అభిప్రాయం ఎంతమాత్రం నిజం కాదు. బాలసాహిత్యం ఒక విశిష్ట సాహిత్యస్వరూపం దీనికిప్రత్యేక ప్రతిపత్తి ఉంది. శాస్త్రీయ విధానము ఉంది. సిద్ధాంత ప్రాతిపదిక ఉంది. సామాజిక ప్రయోజనం ఉంది. శాస్త్రీయ దృక్పథం ఉంది.

బాల సాహిత్యం ఎలాంటిదంటే-

బాలసాహిత్యం ఉన్నత కవితా వాహినికి ఆటపట్టు అన్నారు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. లాలిపాటలూ, జోలపాటలూ పాడుతూ మనతల్లులే, కవితలు అల్లిఉండవచ్చు. అదే తొలి బాలసాహిత్యం.' అన్నారు బాల అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు గారు.

'భావిపౌరులను తీర్చిదిద్దగల మహత్తర సాధనం సురుచిర స్వప్నాల బాలవాఙ్మయం' అన్నారు శ్రీ మద్దులూరి రామకృష్ణగారు.

'రసప్రపుల్లం చేస్తూ ఆట, పాట, మాటలలో ఆనందంలో మునకలు వేయించేదే బాలసాహిత్య'మని మరొక రేడియో అన్నయ్య శ్రీ ఏడిద కామేశ్వర రావుగారన్నారు.

'పిండి ఆరబోసినట్లు, పాలు పాఱబోసినట్లు హాయిగా కనిపించే వెన్నెల బాల సాహిత్యం' అన్నారు డా॥ మిరియాల రామకృష్ణగారు.

ఆయనే, మరొక సారిఇలా అన్నారు. 'అనుభూతినీ-ఆలోచనలనీ అలవాటు చేసే బాలలప్రపంచం బాలసాహిత్యం.'

బాల సాహిత్యమంటే బాలలకోసం వ్రాసిన సాహిత్యం, బాలల గురించి వ్రాసిన సాహిత్య మని చెప్పుకోవాలి. 'శ్రీ మద్రామాయణానికి బాలరామాయణంలాగ, మన సాహిత్యానికి బాల సాహిత్యం అమరి ఉంది' అంటున్నారు. కొందరు. ఇది ఆమోదయోగ్యమైన అభిప్రాయం కాదు.

ఇది ఎలాంటి దంటే పెద్దవాళ్ళకు, చిన్నపిల్లలకు వచ్చేవ్యాధి ఒకటే అయితే ఇద్దరికీ ఒకమందు వాడితే సరిపోతుంది అనడంలాంటిది. ఇది ఎంత అవివేకమో, 'ప్రౌఢసాహిత్యాన్ని సంక్షిప్తం చేస్తే బాలసాహిత్యంవస్తుం దనడంఅంత అవివేకం. అసమంజసం. బాలలకు ప్రత్యేకంగా వైద్యం ఉంది. నిపుణులైన డాక్టర్లున్నారు. అదేవిధంగా ఈ సాహిత్యానికి కూడా ఒక ప్రత్యేక మైన ప్రతిపత్తి ఉంది ఇదొక ప్రత్యేక విభాగం.

బాలసాహిత్యం వ్రాసే వారు బాలల మనస్తత్వాన్ని బాగా అర్థం చేసుకోవాలి. వారికి అర్థమయ్యే భాషలో, చిన్న చిన్న పదాలతో, మనస్సుకు హత్తుకునే విధంగా, వారి అనుభవంలో వున్న, అనుభూతిలోవున్న విషయాలను, అలంకారాలతో అందంగా మిళితంచేసి, చక్కగా చెప్పాలి. మన భాషాపాటవం, పాండిత్య గరిమ, ప్రదర్శించ డానికి

వీలు పాండిత్య ప్రకర్ష ప్రదర్శిస్తే, ఆ రచన బాలలకోసం చేసిన రచన అని చెప్పుకోవాలి తప్ప నిజానికి అది బాలసాహిత్యం కానేరదు. బాల సాహిత్యం వ్రాసేటపుడు ముఖ్యంగా, తీసుకొనే వస్తువు వారికి సంబంధించినది కావాలి. బాలలకోసం వ్రాస్తున్నామన్న విషయం మర్చిపోరాదు. ఈనాడు అనేక పత్రికలు ఈ బాలసాహిత్యానికి విశేషంగా, ప్రచారాన్ని, ప్రోత్సాహాన్ని ఇస్తున్నాయి. ఎంతోమంది బాల రచయితలు, బాలల రచయితలు తయారవుతున్నారు.

బాలసాహిత్యం ప్రత్యేకంగా ఉండాలనే కృతనిశ్చయంతో తొలిరచనలు సాగించిన వారిలో శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ చింతా దీక్షితులు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగార్లు ముఖ్యులు. శ్రీ చింతా దీక్షితులుగారు రచించిన 'లక్క పిడతలు' రచన ఆరోజుల్లో పిల్లలను బాగా ఆకర్షించింది. బాల సాహిత్య వైతాళికులన దగినవారు శ్రీ గురజాడ వావిళ్ళకొలను, ఆదిభట్ల, చింతా, వేటూరి, గిడుగువారు, వేసిన మూలబంధంపైని బాలసాహిత్య భవనం అనేక భూమికలతో ఆకాశంవైపు ఎగసిపోతోంది. ఆధునిక సాహిత్యంలో, శాస్త్రీయ దృక్పథంతో బాలసాహిత్యాన్ని కూడా ప్రారంభించిన వారు శ్రీ వీరేశలింగం పంతులుగారు. వారు 'ఈసప్ నీతికథలు' తొలిసారిగా, తెలుగు బాలల కందించారు.

బాలసాహిత్యంలో 'శైలి' అత్యంత ప్రాముఖ్యం వహిస్తుంది. బాలపాఠకుల్ని ఆకట్టుకునే 'శైలి' పట్టుపడటం సులభసాధ్యం కాదు. అది ఒక తపస్సు. చిన్నారుల వెన్నమనసుల, చిందులాడే చిలిపి చేష్టలు, పసిడి పలుకుల వెలువరించే పెక్కు చోద్యపు చిక్కు ప్రశ్నలు నిదానంగా, నేర్పుగా అవగాహన చేసుకొనే భావుకులకే యీ శైలి స్వాధీనమవుతుంది. ప్రతిభావంతులు రచయితలకైనా, సుకుమార హృదయాకర్షకమగు, కుసుమ పేశలమైన 'శైలి' పట్టుపడనిదే బాల సాహిత్య రచన పరిపుష్టం కాదు; ప్రాచుర్యం పొందలేదు. బాలసాహిత్యంలో ఏ ప్రక్రియయైనా సులభశైలిలో సుబోధకంగా,-పిల్లలతో మాట్లాడునట్టుగా-వాళ్ళను ఆకర్షించేటట్టుగా, మాతృసమ్మితంగా ఉండటమే, కాకుండా, పిల్లలకు మానసిక ఆరోగ్యాన్ని కల్గించేదై ఉండాలి.

పిల్లలు సమగ్రజీవులు. వారిని మొదటి నుండీ సంపూర్ణ మనుజులుగానే భావించి, వారికి నైతిక శిక్షణ గరపాలి. లేకుంటే వారు పిల్లలుగానే ఉండిపోతారు.

పిల్లలకథల్లో ఒక విచిత్రమూ, వింత, యైన విషయం సృష్టిస్తూ, వారిని ఊహాలోకాల్లో విహరింపచేస్తూ, చివరకు నీతిని, వినోదాన్ని, విజ్ఞానాన్ని, అందించాలి. కథల్లో పక్షులు జంతువులతో మాట్లాడినట్లు, జంతువులు పక్షులతోను, మనుష్యులతోను, మాట్లాడినట్లు సృష్టించిన అద్భుత రచనలు పిల్లలకు ఎంతో సంతోషాన్ని కుతూహలాన్ని కల్గిస్తాయి. కాని పక్షులతో జంతువులు, జంతువులతో మానవులు మాట్లాడటం వంటి విషయాలు 'హేతువాద దృష్టితో' పరిశీలిస్తే కొంత విరుద్ధంగా కనపడినా, పిల్లలను ఆకట్టుకునే కల్పనా శిల్పం వాటిలో పుష్కలంగా ఉంది. పిల్లల కథలు ఎలా ఉండాలంటే తేలికైన భాషలో, సునిశితమైన హాస్యంతో, బాలల్లకు ఆశ్చర్యాన్నీ-ఆనందాన్నీ-ఆహ్లాదాన్నీ కల్గించే కథలైతే ఆసక్తిదాయకంగా ఉంటాయి. కథ కుతూహలం కల్గించేదిగా ఉండాలి, ఏకాగ్రత కల్గించేది కావాలి.

పసిపిల్లల హృదయాలపై చిన్ననాటి అనుభవాలు. అనుభూతుల్లు, భయాలు గాఢంగా ముద్రించబడ్డాయి. బాల్య నుంచి వారిని సక్రమమార్గంలో నడిపించాలి. సత్ప్రవర్తన అలవర్చాలి. మంచి సూక్తి కథాసుధలను అందించవల్సిన బాధ్యత తల్లిదండ్రులపై ఉంది.

బాలసాహిత్యం ఒక్క తెలుగులోనే కాక యావద్భారత భాషల్లోను లక్షిస్తోంది. ప్రపంచమంతా బాలసాహిత్యం విస్తరించింది.

బాలసాహిత్య రచయితలలో ప్రముఖులు శ్రీ చింతా దీక్షితులు, శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ లేజండ్ల సాంబశివరావు, శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీ నార్ల చిరంజీవి, శ్రీ కవిరావు, శ్రీ బి. వి. నరసింహారావు, శ్రీ ఏడిద కామేశ్వరరావు, శ్రీ కన్నం నాయుడు, శ్రీ దుర్గానంద్, శ్రీ ఊత్పల సత్యనారాయణాచార్య, శ్రీ మిరియాల రామకృష్ణ, శ్రీ కవుల ఆంజనేయశర్మ. శ్రీనండూరి రామమోహనరావు, శ్రీ తాడి వెంకటకృష్ణారావు, శ్రీ మొండా ప్రభాకర్, శ్రీ శ్రీనివాసకాశ్యప, శ్రీ నజీరా, శ్రీ వెలగా వెంకటప్పయ్య, శ్రీ కె. సభా, శ్రీ దివాకర్ల వేంకటావధాని, శ్రీ రెడ్డి రాఘవయ్య, శ్రీ నీలా జంగయ్య, శ్రీ సన్నిధానం యజ్ఞనారాయణమూర్తి, శ్రీ పి. శ్రీనివాస శాస్త్రి, శ్రీ శ్రీ, శ్రీ దాశరథి, శ్రీ ఎన్. వి. అప్పారావు. శ్రీ వక్కలంక లక్ష్మీపతిరావు, శ్రీజంధ్యాల పాపయ్యశాస్త్రి, శ్రీ న్యాయపతి కామేశ్వరి, జ్యోతిర్మయి, శ్రీమతి వింజమూరి లక్ష్మి, మొదలైనవారు ఎందరో ఉన్నారు.

బాలసాహిత్యాభివృద్ధి - (బాలల) అకాడమీ - కృషి:

పిల్లల సర్వముతో ముఖవికాసంకోసం ఒక ప్రత్యేక సంస్థను నెలకొల్పిన ఘనత మనదేశంలో ప్రప్రథమంగా ఆంధ్రప్రదేశ్ దక్కింది. 1976లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ స్థాపించబడి, దిగ్విజయంగా, కొనసాగుతోంది. అకాడమీ

అనేక అభ్యుదయ కార్యక్రమాలని రూపొందించి, అమలు పర్చింది. సెప్టెంబరు 21 నుండి 28 వరకు నాగార్జున సాగర్ 'విజయపురి' లో అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్ బాలలఅకాడమీ 'బాలసాహిత్య శిక్షణ శిబిరాన్ని' నిర్వహించింది. లోగడ ఇలాంటి శిబిరాలు మూడు శ్రీ గిడుగు సీతాపతిగారి ఆధ్వర్యంలో జరిగాయి. ఈ నాల్గవ శిక్షణ శిబిరానికి (బాలసాహిత్య శిక్షణ) సర్వశ్రీ వెలగా వెంకటప్పయ్య గారు డైరెక్టరుగా ఉన్నారు. అన్ని జిల్లాలనుంచి ప్రతినిధులను (యువ నవ, కవులను) రప్పించి వారికి శిక్షణ ఇప్పించి 'బాలసాహిత్య రచయితలనుగా' తీర్చిదిద్దిన అకాడమీ కృషి అద్వితీయం, ప్రశంసనీయం.

అకాడమీ నిర్వహిస్తున్న, నిర్వహించిన కార్యకలాపాలు :

1. పిల్లలలో సాహిత్యాభిలాషను ప్రోత్సహించి వర్ధిల్లచేయడం.

2. సంగీతం, నృత్యం, చలనచిత్రం, నాటకం, చిత్రలేఖనం, ఛాయాగ్రహణం వంటి కళారంగాల్లో ప్రతిభా పాటవ పోటీలు ప్రతియేటా నిర్వహించి బహుమతులు అందచేయడం.

3. పిల్లలకు ప్రయోజనకరమైన రచనలను ప్రోత్సహించడం.

4. అకాడమీ ఆశయాల సాధనకు తోడ్పడే సంస్థల కార్యకలాపాల్లో సహకరించి, వాటిని సమన్వయపరచడం.

5. అర్హమైనసంస్థలకు గుర్తింపు ఇచ్చి అవి చేపట్టిన పిల్లలకార్యక్రమాలకు సహాయం అందివ్వడం.

6. పిల్లల ఉత్సవాలు, మహాసభలు, శిబిరాలు, సదస్సులు, పోటీలు, ఆటలు, విజ్ఞానయాత్రలు; మొదలైనవాటికి ఆధ్వర్యం వహించడం, వాటిని నిర్వహించడం.

7. ఇతర రాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను జరిగే పిల్లల కార్యకలాపాలతో సహా బాలలసాహిత్యాన్ని గురించి, కళలను గురించి అధ్యయనం, పరిశోధన, జరపడం, అందుకు ప్రోద్బలం కలుగజేయడం.

8. పిల్లల సాహిత్యం కళలు, తత్సంబంధమైన కార్యక్రమాల్లో విశిష్టకృషి చేసిన ఆయా రచయితలకు బహుమతులు, గౌరవచిహ్నాలు ఇవ్వడం.

9. సాహిత్యంలోను, కళలలోను ప్రతిభ చూపుతున్న పిల్లలకు స్కాలర్షిప్పులు మంజూరుచేయడం.

10. సాంస్కృతికపరమైన కార్యక్రమాల వినిమయంద్వారా పిల్లలలో జాతీయ, అంతర్జాతీయ అవగాహన సంబంధాలను పెంపొందించడం.

11. బాలల సాహిత్య గ్రంథాలయాలను నెలకొల్పడం.

12. పిల్లలకోసం పుస్తకాలు, పరిశోధన వ్యాసాలు, పత్రికలు ప్రచురించడం, అట్టి ప్రచురణను ప్రోత్సహించడం.

13. బాలసంఘాలు, ఫిలిమ్ సంఘాలు, బాలభవన్‌లు మున్నగువాటి ఏర్పాటును ప్రోత్సహించడం.

14. ప్రభుత్వంగాని, ఇతరులుగాని, కోరినపుడు పిల్లలసంక్షేమంగురించి సలహాలివ్వడం.

మొదలైనవి ఇంకా ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తోంది.

వివిధసంస్థలు, వ్యక్తులు, పత్రికలు కూడా ఈబాలసాహిత్యాభివృద్ధికి ఇతోధికంగా సహాయ పడుతున్నారు. ఇది నిజంగా గర్వించదగ్గ విషయం.

బాలలకోసం పూర్వకాలంలో పత్రికలంటూ ఏమీ ఉండేవి కావు. స్వాతంత్ర్యానంతరం బాలసాహిత్యం బాగా అభివృద్ధి చెందినది. అనేక పత్రికలు వెలుగులోకి వచ్చాయి. చాలమంది రచయితలు ఈ రంగంలోకి దూకి తమ బంగారు రచనలతో సుసంపన్నం చేశారు. ఇంకా అనేకులు ప్రోత్సహింప బడుతున్నారు. కొన్ని బాలసాహిత్య పత్రికలు బాల, బాలమిత్ర, బాలభారతి, బాల చంద్రిక, బాలవాణి, చందమామ, బుజ్జాయి,బొమ్మరిల్లు, విద్యాబాల, ఆనంద బాల, ప్రమోద, స్నేహబాల మొదలైనవి ఇంకా ఎన్నో ఉన్నాయి.

బాలసాహిత్య సృష్టికోసం ప్రత్యేకంగా రచయిత లెవరూ లేరని చెప్పాలి. పెద్దల కోసం రచనలు చేసేవారే ఇటు పిల్లలకోసంకూడా రచనలు చేస్తూండటం జరుగుతోంది. అలాకాకుండా ఈరంగంలోనే విశేషంగా కృషిచేసేవారు చాలా అవసరం.

ప్రపంచంలో ఉన్న ఉత్తమ బాలసాహిత్యాన్నంతనూ తెలుగులోకి అనువదించి పిల్లలకు అర్థమయ్యేరీతిలో, అందమైన బొమ్మలతో ముద్రించాలి. ఇతర దేశాల్లో బాలసాహిత్యాన్ని కున్నంత ప్రోత్సాహం మన దేశంలో లేదనే చెప్పాలి. ఇక్కడ ఉన్నవారు బాలల రచయితలే కాని బాల రచయితలు కారు. రష్యాలో పిల్లలే వ్రాసిన రచనలు ముద్రిస్తూ, వారికి ప్రోత్సాహ మిస్తున్నారు. ఇది నిజంగా చాల సంతోషించవల్సినవిషయం.విదేశాలు సాహిత్యరంగంలోకూడా మనదేశాన్ని అధిగమించాయి. మన దేశంకూడా ఆ దేశాలతో సమానస్థాయిలో నిలబడగల దని ఆశిద్దాము.

ఈ వ్యాసరచన కుపకరించిన పుస్తకాలు.

1. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ మహాసభలు ప్రత్యేక సంచిక 1977.

2. 'తెలుగువాణి' ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేకసంచిక,ఉగాది1975.

* బాలబాలికలు అనేఅర్థంలో 'బాలలు' అని అందరూ వాడుచున్న పదం సరియైనదికాదు. అంతకంటె పిల్లలు అనుటయే సముచితం. – సంపా.

—•••—

# నన్నయ - 'ప్రసన్నకథా వివిధార్థయుక్తి'

— శ్రీ సాంబయ్య పరిమి, ఎం. ఏ., బి. ఎస్‌సి.

( గతసంచిక తరువాయి )

ప్రసన్నకథాకథితార్థ యుక్తిలో నారసి:

పాఠము. కొ. చొ. ప్రతులలోనే కలదు. పరిశోధిత ప్రతిలో 'కథితార్థ యుక్తి' అను పాఠాంతరమునిచ్చు కావున (Foot Note) 'కథాకథితార్థ యుక్తి' అని ముద్రితము 12, పాఠాంతరమును యథాతథముగ గైకొన్నచో ఛందోదోష మేర్పడును.

'కథిత' మనగా చెప్పబడినది 'ప్రసన్నముగా చెప్పబడిన కథయందలి అర్థముల కూర్పు' అని సమాసార్థము.

సూతుడు శౌనకాది మునులకు వినయావనతుఁడై నమస్కరించి తాను 'పురాణపుణ్య కథాకథన దక్షుం' డని చెప్పెను. 'సూతునకు కథాకథన దక్షత' అను విశేషణము సంస్కృత భారతమున లేదు – 'లోమహర్షణపుత్ర ఉగ్రశ్రవాః సూతః పౌరాణికో నైమిశారణ్యే శౌనకస్య కులపతే ర్ద్వాదశవార్షికే సత్రే ఋషీనభ్యాగతానుపతస్థే' (1-4-1 శ్లోక) తెనుగు భారతమునందే కలదు. ఈ 'కథాకథన దక్షత' నన్నయ దని భావింపనగును. అట్టిచో 'కథాకథితార్థయుక్తిని' మరల చెప్పుట వలన ప్రయోజనము లేదు. అంతేకాదు. ఈ పాఠమునకుఁగల అర్థము 'ప్రసన్న కథార్థయుక్తి' అను సమాసార్థమునకు సమానమగుటచే 'కథిత' శబ్దము వ్యర్థమగు చున్నది.

'ప్రసన్న కథాకవితార్థ తత్త్వమున్నారసి; / మొప్పారసి'

ఈ పాఠములకు ప్రసన్నమైన కథలయందలి కవితార్థ తత్త్వమును విచారించి కవితార్థ తత్త్వముయొక్క గొప్పదనమును విచారించి అను అర్థములు చెప్పదగును. ఇందు కవితార్థ తత్త్వ మొప్పారసి అనునది 'కవితార్థయుక్తితో నారయు' టకు సమానము.

'లో నారయు' 'ఆరయు'టకన్న అధికార్థబోధకము. కావున III వ పాఠము VIII వ పాఠముకన్న మెరుగు. V వ పాఠమునందు 'లో తారసి' అనికలదు. 'లో తారసి' 'లో నారసి' ఇంచు మించుగ సమానములు.

ప్రసన్నకథా వివిధార్థ యుక్తిలో నారసి:

ఈ పాఠము కొన్ని ప్రతులం దున్నట్లు సంశోధిత ప్రతి తెల్పుచున్నది. ప్రసన్నమైన కథయందలి వివిధార్థముల కూర్పు అని పాఠార్థము. వివిధార్థము లనగా, స్థూలదృష్టికి గోచరమగు కౌరవపాండవుల కథ నాలంబనముగ చేసికొని అందు కూర్పబడిన ధర్మశాస్త్ర, నీతిశాస్త్ర, వేదాంతశాస్త్ర, ఇతిహాస, మహాకావ్య, పురాణాదుల అర్థములు.

నన్నయ తెనుగు చేసిన మహాభారతమునందు వివిధశాస్త్ర లక్షణము లున్నవనుట జగద్విదితము – (చూడు. వ. ధర్మతత్త్వజ్ఞులు) సంస్కృత భారతమునందును గలదు –

ధర్మకామార్థ శాస్త్రాణి శాస్త్రాణి వివిధానిచ
లోకయాత్రా విధానం చ, సంభూతం దృష్టవా నృషిః (1-1-47 శ్లో)

వ్యాసభారతమున కథ అను స్యూతముగ నడువదు సన్నివేశ పునరావృత్తులచే, వేదాంతాధ్యాత్మికస్తోత్ర విషయ శ్లోకములచే కథ తేలికగ ప్రసన్నము గాదు. కథాకథనదక్షుడు 'నానారుచిరార్థసూక్తి' నిధి అయిన నన్నయ తన బుద్ధిబాహుబలముచే భారతభారతీ సముద్రము నీది అచట లభించిన 'కృష్ణార్జునోత్తమ నానాగుణ కీర్తనార్థఫల' మైన ప్రసన్న భారత కథను మన కందించినాడు. ఇది కౌరవపాండవుల చరిత్ర మాత్రమే కాదు. వ్యాసహృదయ ప్రతిపాదిత వివిధార్థయుక్త రచన. జిజ్ఞాసువులు, సారమతులునైన కవులు, వేయికళ్ళతో లోనారసి వ్యాస హృదయము నెరిగి మేలన వలె నని నన్నయ భావన.

'ఆయుష్యం బితిహాస వస్తుసముదా
యం బైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తి నిమిత్త ముత్తమ సభా
సేవ్యంబు లోకాగమ
వ్యాఖ్యైకాంత గృహంబునాఁ బరగి నా
నా వేద వేదాంత వి
ద్యాయుక్తంబగు దానిఁ జెప్పఁ దొడగెన్
తద్భారతాఖ్యానమున్' –
(ఆది. తృ 11 వ)

అని మహాభారతి స్వరూపమును నన్నయ తెలిపినాడు.

మహాభారతములోని 'ఇతిహాసవస్తు సముదాయ'ము నన్నయ రచనలో ప్రసన్నకథ' గా పరిఢవిల్లినది. 'నానా వేద వేదాంత విద్యాయుక్తం బగు' విషయము 'వివిధార్థయుక్తి'లో తెనుగున వెలిగినది. ఈ పద్యములోని 'ఇతిహాసవస్తు సముదాయము' 'నానావేద వేదాంత విద్యాయుక్తం బగు దాని' భావముల సంక్షిప్తీకరించిన ప్రసన్నకథా వివిధార్థయుక్తి' అగుచున్నది.

భారతము ఆదరణీయసార వివిధార్థగతి స్ఫురణంబుగల్గి యష్టాదశపర్వ నిర్వహణ సంభృతమై, పెనుపొంది' యుండె నని తిక్కన చెప్పినాడు. 13 ఈ పద్యములోని 'వివిధార్థగతికి' సంశోధిత

పతిలో ‘కవితార్థగతి’ అను పాఠాంతము గలదు. ఈ పద్యములోని ‘సార విధార్థగతి’ ‘ప్రసన్నకథా వివిధార్థయుక్తి’ని తలపించుచున్నది. అంతేకాదు. వివిధం సంహితా జ్ఞానం దీపయంతి మనీషిణః ‘(1-1-51శ్లో) అను భారతశ్లోకము ‘వివిధార్థగతిస్ఫురణ’మే ‘వివిధార్థయుక్తి’కి మూలముగా నున్నది.

వ్యాసముని ప్రణీత పరమార్థమును తెల్లము చేయుశక్తి ‘ప్రసన్న కథావివిధార్థ’ ‘యుక్తి’కే కలదు. ‘కలితార్థయుక్తి’ తత్త్వార్థయుక్తి’ ‘కథితార్థయుక్తి’ వ్యాస హృదయమును తెలుపలేవు. ఈమూడిటికన్న ‘కవితార్థయుక్తి’ అర్థవంతమైనది.

‘కూ’ ధాతు నిష్పన్నమైన ‘కవి’ కి వర్ణించువాడు అని అర్థము. అంతేకాక దాగియున్న దానిని ప్రకాశవంతము చేయువాడు, సర్వమును వ్యక్తము చేయువాడు, ‘కవి’ అని యాస్కాచార్యులు నిర్వచించిరి-

విశ్వారూపాణి ప్రతిముంచతే కవిః
ప్రాసావీ ద్భద్రం ద్విపదే చతుష్పదే
నాకముఖ్యత్ సవితా వరేణ్యోఽను
ప్రయాణ ముషసో విరాజతి.

విశ్వాని సర్వాణి రూపాణి రూపవస్తు
జాతేషు ప్రతిముంచతే ఆబధ్నాతి।
యోఽపశ్యన్ రూపాణ్యావిః కుర్వన్।
కవిః క్రాంతదర్శనః । అథవా కవతేః
ధాతోః గత్యర్థస్య కవిః గచ్ఛత్యసౌ
నిత్యం’14

పై అర్థమునుబట్టి ‘ప్రసన్నకథా కవితార్థయుక్తిలోనారసి’ పాఠమునకు ఈ క్రింది విధముగ అర్థము చెప్పవచ్చును.

ప్రసన్నమైన కథయందు / వర్ణింపబడు/గుప్తమైన దానిని ప్రకాశవంతము చేయు/సర్వమును ధ్వనింపజేయు / భారతార్థములకలయికను సారమతులైన కవీంద్రులు లోనారసి మే లనగలరు.

సమన్వయ దృష్టితో చూచిన, ప్రసన్నకథా వివిధార్థయుక్తిలో నారసి, ప్రసన్నకథా కవితార్థయుక్తిలోనారసి’ పాఠములు మిగిలిన పాఠముల అర్థములను తమయందిమిడింపజేసికొనసమర్థమైనవిగా నున్నవి ఈరెండిటిలో ‘వివిధార్థయుక్తి’ గల పాఠమునకు అర్థము స్పష్టముగా నున్నది. ‘కవితార్థయుక్తి’ గల పాఠమునకు అర్థము, మనము వ్యాఖ్యానము చేసికొనుటపై అధారపడియున్నది. పాఠాంతరము లేర్పడుటకు వి/లి, లో/తో, లకు అవకాశ మెక్కువ. కవిత/వివిధలకు తక్కువ. ఈఒక్కవిషయము మినహా ‘ప్రసన్నకథా వివిధార్థయుక్తిలోనారసి’ పాఠము సంజసముగ నున్నది.

ఈ ప్రయత్నము వివిధ పాఠములను, వానిపైగల వాగోపవాదములను, ఒకచోట చేర్పవలెననియే కాని, పాఠముల సాధుత్వాసాధుత్వములను నిర్ణయింపవలెననికాదు. పాఠమేదైనను నన్నయకవితాస్వరూపమును దర్శించి ఆనందించు వారికి కలుగు నష్టములేదు, నన్నయ సర్థము చేసికొనలేనివారికి కల్గు లాభమును లేదు, భారత పరమార్థమునకు భంగము వాటిల్లదు.

---

అథస్సూచిక :

12. ఆంధ్రభారతము (ఆది సభాపర్వములు సంశోధిత ప్రతి :- ప్రథమాశ్వాసము 26 వ పద్యమునకు గల పాఠాంతరము.
13. విరాటపర్వము (సంశోధితప్రతి) ప్ర. 6 పద్యము.
14. Nirukta of Yaska. page. 1116, 1117 Bombay Sansksit & prakrit Series. No. Lxxxv.

Note :- ఈవ్యాసమున సంస్కృత భారతశ్లోకములసంఖ్య భండార్కర్ ప్రతినుండి ఇయ్యబడినది.

—•••—

# మన సాహిత్యంలో మగువ!

శ్రీ రామడుగు వెంకటేశ్వరశర్మ.

* అందమై ఆనంద బృందమై, మృదులని
ష్యందమై మిగుల నింపొందు నెద్ది?
తల్లియై, గారాలచెల్లియై, రాగాల
వల్లియై తానుల్లసిల్లు నెద్ది?
మహితయై,వైదుష్య సహితయై,అభిమాన
పిహితయై మహిలోన వెలయు నెద్ది?
శక్తియై, వ్రతకృతాసక్తియై, త్యాగాను
రక్తియై యొనలేక గ్రాలునెద్ది?
నారిలేనట్టి విల్లును, నారిలేని
ఇల్లు వ్యర్థంబనంగ రాజిల్లు నెద్ది?
ఓర్పు నేర్పుల కూర్పులో నొప్పు నెద్ది?
అద్ది ప్రాణుల మేల్బంతి అది పడంతి?

* భారతకవుల వాగ్వైఖరిలో తుత్ర
భావదీప్తుల నుగ్గుపాలు గ్రావి.
శ్రీనాథుని రసప్రసిద్ధ సమత్వాన
చిత్రవాగ్రచనైక శిక్ష మెలఁగి
కవితాపితామహు కల్పనా శిల్పా.
రాగరాగిణి యాచు రాణకెక్కి
సూరనార్యు నపూర్వసుందరకృతిలో క
లాప్రపూర్ణోదయ లబ్ధినడసి
లోకనాటక మాడించు రూపమొంది,
త్యాగమయిగ, అపత్యానురాగమయిగ
సత్యశివ సుందరాత్మ ప్రశస్తి నొంది
ఇంతి కావ్యాలలోన మేల్బంతి యయ్యె.

* ‘కందుకూరి’యు, ‘గురజాడ’క్రమగతిన్ని
సంఘగత దురాచారమా సరణియ నెడి
తెరను దొలగించి ముత్యాలసరముగూర్ప
ఇంతి కావ్యాలలోన మేల్బంతి యయ్యె!

* లలిత‘రమ్యాలోక’లాలనుల్ మెచ్చంగ
‘రాయప్రోల్’ సూత్రధారణ మొనర్ప
రమణీయ గాంభీర్య రసమహోర్థములొప్ప
‘కృష్ణశాస్త్రి’యు భావగీతి దెలుప
‘విశ్వనాథ’ బుధుండు వీనుల విందుగా
‘కిన్నెర’ తంత్రులఁ గీలుగొలుప
విద్వదినుతరీతి వెలయంగ ‘నండూరి’
పదమెత్తి రాగ సంపదలఁ గూర్ప

# కవిత్వం ఎవరికోసం

— శ్రీ ఇ. టి. లోకనాథరావు, ఎం. ఏ.

(గతసంచిక తరువాయి)

మేధాశక్తి మరియు హృదయశక్తి సమంగా మిళితమైనవాడే నిజమైన కవిత్వంకాని మరే విషయమైనాకాని అభివ్యక్తమౌతుంది. సంప్రదాయ వాదులు మేధ అనేది జన్మతః సంక్రమించే దని వాదిస్తారు. కాని దర్శకుడు కాని, డార్విన్ కాని చెప్పిందేమి టంటే జన్మతః వచ్చిన ముడిపదార్థమైన మేధకు తాను నివసిస్తున్న పరిస్థితులు, దేశకాలాదులు ఒక నిర్ణీతమైన ఆకృతిని కల్పిస్తాయి. అదే విధంగా హృదయ మనేది భావాల నిలయం. లేదా కేంద్రస్థానం. ఈస్థానం నిత్యనైమిత్తిక కార్యకలాపాల్ని బట్టి, సంఘటనల్ని, బట్టి మారుతూ ఉంటుంది. మనప్రాచీన దార్శనికులు కూడా మేధను పర్యవేక్షించడమే గొప్ప తాత్త్విక చింత అని చెప్పారు. కనుక అటువంటి మేధాశక్తిని హృదయశక్తిని కలిగించే మనుషుల్ని, వారి జీవన పరిస్థితుల్ని మరిచి, అవ్యక్తదశలోనికి తోసేసి, బలాత్కారంగా భావాలను సంపుటీకరించి చెప్పే కవిత్వం నిజానికి అసలు సిసలైన కవిత్వం కాదు. అందుచేతనే ప్రఖ్యాత మానసిక విశ్లేషణ సిద్ధాంతకర్తయైన ఫ్రాయిడ్ సైతము అవ్యక్తవ్యక్తిచేతనలో దాగున్న భావాలు నిజమైన వ్యక్తిత్వానికి నిదర్శనాలని చెప్పాడు. ఒక సైంటిస్టు ప్రయోగశాలలో పరిశోధనచేస్తున్న పరికరాలకు గాని, వస్తుదాయానికి కాని నిజమైన ఉత్పత్తిదారు లెవరో గుర్తించడమే అసలైన జ్ఞానం. అదేవిధంగా కవియైనవాడు రాస్తున్న కలాన్ని, కూర్చున్న కుర్చీని, వాడుతున్న కాగితాన్ని, చదువుతున్న పుస్తకాల్ని, ప్రకటిస్తున్న పత్రికల్ని ఉత్పత్తి చేస్తున్న లేదా నిర్మిస్తున్న వారిని గురించి ఆలోచించడం నిజమైన సృజనాత్మకత. ఆవిధంగా చేయక నా గొప్పదనం వలన కవిత్వం రాస్తున్నానని కవిగాని, నామేధవలన ప్రయోగం చేస్తున్నా నని సైంటిస్టు కాని అనుకొంటే అదికేవలం భ్రమ, ఉన్మాదం. ఒక శ్రీనాథుడు, ఒక నన్నయ, ఒక న్యూటన్ అంటూ ఉండరు. ఆ కాలపు అనేక వ్యక్తుల, లేదా పరిస్థితులసమాహారమే ఒక వ్యక్తిద్వారా అభివ్యక్తమౌతుంది. దీనిని T. S Eliot, the will of the anasses behind a single voice' - అని చక్కగా చెప్పాడు. ఎవరివల్లనైతేమనం జీవనాన్ని సుఖమయంగా గడుపుతున్నామో, ఆటువంటివారిని గూర్చి కనీసం ఆలోచింపకుండా ఉండటం అన్నిటికన్నా క్షుద్రకార్యము. ఈ విషయాన్నే శ్రీ స్వామి వివేకానంద లండనులో చెప్పాడు.

ప్రాచీన తెనుగు కవులకు, శాస్త్రవేత్తలకు ఈ విషయం స్ఫురింపవచ్చు. కాని అట్టి స్ఫురణను కప్పిపుచ్చడానికి ఆనాటి రాజకీయ వ్యవస్థ, మతప్రాబల్యం ముఖ్యంగా కర్మకాండ, దోహదం చేసాయి. కవియైనవాడు ఆనాడు ప్రత్యేక వర్గంగా భావించి జ్ఞానము లేని వారిని కానిసలనుగా, క్షుద్రులనుగా చూసేవాడు తప్ప తనజీవన పరిస్థితులకు దోహదం చేసే మౌలిక శక్తినిగా చూసేవాడు కాడు. అందుకు కారణం అతనికి రాజుల అండదండలు ఉండేవి. రాజుకు తనకు లేని కీర్తిప్రతాపాలను దిగంతాలకు వెదజల్లే కిరాయి కవులు అవసరం. ఈస్వార్థపూరిత సంబంధంవలన ఆలోచింపవలసిన కవిత్వంకాని, విమర్శ కాని ఆరోజుల్లో ప్రదర్శింపబడలేదు. ఈనాడు రోజులు మారాయి. రాజులు, రాజ్యాలుపోయి సామూహిక శక్తికి ప్రాధాన్యం లభించింది. నిరంకుశత్వం ఎక్కువకాలం మనుగడ సాగించలేదన్న సత్యాన్ని చరిత్ర ఋజువుచేసింది. ప్రజలే చరిత్రనిర్మాతలనే భావనలు దశదిశలా వ్యాపించినవి. తత్ఫలితంగా కవితారంగాన్నే కాకుండా, అన్ని కళారంగాల్ని ప్రజావాణి ప్రభావితం చేస్తున్నది. కనుక ప్రజలకోసం కవిత్వం రాయడం తప్పనిసరిగా పరిణమించింది. అందుకు భిన్నమైన దానిని ఏహ్యభావంతో చూడడంకూడా ప్రబలింది.

ఏ కళారంగానికైనా కేంద్ర బిందువు మనిషి. ఆ మనిషి ఏవర్గానికి చెందినవాడైయుండాలి? అని ప్రశ్నించినపుడు, ఏవర్గమైతే జీవనవిధానాన్ని ముందుకు నడిపిస్తుందో ఆవర్గానికి చెందిన వాడైయుండాలి. అటువంటి మనిషి పడుతున్న (అనుభవిస్తున్న) నవరసాలు ఆలంబనంగా, వాస్తవిక దృక్పథంతో రచించలేని కవిత్వం ప్రజాకవిత్వంకాదు. ప్రజల్ని ప్రతిబింబించలేని కవిత్వం ఒకే కన్నుకల మనిషివంటిది. నన్నయ మొదలు నేటివరకు కల కవిత్వాన్ని విశ్లేషిస్తే, సాహిత్యం పండితవర్గాన్నే పైకెత్తేదిగా ఉంటుంది. ప్రాచీన కవులు మేధాపరమైన విజ్ఞానాన్ని ప్రదర్శించడానికి కంకణం కట్టుకొన్నారు గాని, హృదయవర్తితమైన సానుభూతికి, మానవత్వానికి స్థానం కల్పించలేకపోయిరి. ఒక

---

ఎన్నొ యున్నన్నొ రూపాల నింపులలర
మించి యపురూపముగను ధరించి యార
ప్రణయ రంగస్థలము నందు లాస్యమాడి
ఇంతి కావ్యాలలోన మేల్బంతియయ్యె॥

వివిధ సమస్యలకును నిల
మివులపరిష్కారపథము మేలుగ వెలయన్
బవిముల గతిఁ బ్రగతిని గని
నవలలలో నవల నేఁడు నవనవలాడెన్॥

—•••—

పేరిట స్థానం కల్పించినా దాన్ని మతంతో ముడిపెట్టి చైతన్య రహితం చేసారు. అయితే ఆధునికులు మాత్రం ఒక్క వర్గాన్నే ప్రతిబింబించే సాహిత్యం రాయడం లేదా? అని ప్రశ్నిస్తే, అవును రాస్తున్నారనే చెప్పాలి. ఏవర్గమైతే నూటికి ఎనభై వంతులు సర్వకాల సర్వావస్థల యందు ఇరవై శాతంగలవారి భోగభాగ్యాల కోసం జీవన పరిశ్రమ చేస్తున్నారో ఆ వర్గాన్ని కవితాపరంగా ప్రదర్శించడమే న్యాయం, ధర్మం. ప్రాచీనులు చెప్పిన మతిపరంగా చూసుకొన్నా, అన్ని 'ఆత్మల్నీ నీ ఆత్మగా చూడు' - అన్న సారాంశాన్ని కూడ ప్రాచీనులు పరిగణనలోనికి తీసుకోక, స్వార్థచింతనకు, జీవనభృతికి పనిముట్టుగా వాడుకొన్నారు.

ఉపనిషత్తుల ప్రకారంగాని, బౌద్ధుల ప్రకారంగాని, లేదా నవీన భౌతిక తార్కిక సిద్ధాంతి హెగెల్ ప్రకారం కాని విశ్వంలో ఏ వస్తువు నిశ్చలంగా లేదు. ప్రతీదీ నిరంతరగమనశీలం. మార్పు అనేది పిపీలికాది బ్రహ్మపర్యంతము జరుగుచున్న క్రమపరిణామం. కావున ప్రాచీన కవులు ప్రజలకోసం కవిత్వం రాయలేదని ఈసడించడం, నవీనులు రాస్తున్నారని చంకలు గుద్దుకోవడం రెండూ అవివేకాలే. పరిణామంలో గతులు, స్వభావాలు, దృక్పథాలు మారుతూ ఉంటాయి. సర్వజనీనమైన దేదీ ఈ భౌతిక జగత్తులో ఉండదు. కావున ప్రాచీనులు తమ కవిత్వమేగొప్పదని, ఆధునికులు తమదే గొప్పదని చెప్పుకోవడం సమంజసం కాదు. ప్రస్తుత కాల పరిస్థితుల దృష్ట్యా కవిత్వాన్ని ప్రజాపరం చెయ్యడం నేటి యుగధర్మం. అలా చెయ్యనని మూర్ఖపు పట్టుపట్టడం కేవలం జడత్వమౌతుంది తప్ప, చైతన్యవంతంకాదు. కాబట్టి ప్రస్తుత జీవన విధానం గడపడం అని వాక్యం. ప్రాచీన భావాల్ని మనపై రుద్ది, అవిధంగానే నడవమనటం అవివేకుల లక్షణం. మనిషిగా ఎవరికివారు ఆలోచించి చూస్తే ఒక నిజం బయటపడుతుంది. అదేమిటంటే మన సర్వాంగీణ స్ఫూర్తికి దోహదం చేస్తున్న ప్రజకు మనరంగాల్లో మనం స్థానం కల్పించాలి. కవి యైనవాడు కవిత్వంలో, గాయకుడైన వాడు గానంలో, శిల్పి శిల్పంలో తప్పని సరిగా పీఠాన్ని కేటాయించాలి. అలా సమర్పించని పక్షంలో, అది కేవలం రాక్షసత్వమే అవుతుంది; తప్ప మానుషత్వం కాదు. ఏకళారంగమైనా అందునా కవిత్వం తప్పని సరిగా ప్రజాపరం చేయడం అత్యంత అవసరం. అలాచేయని పక్షంలో ప్రజాపద ఘట్టన క్రింద నలిగి నశించిపోవడం తథ్యం. ప్రజలే చరిత్ర నిర్మాతలు. ప్రజలే భావిని సృజించే నేతలు. కనుక ప్రజాపరం కానిదేదీ ఎక్కువకాలం మనుగడ సాధించలేదు.

—...—

# బొబ్బిలి యుద్ధకథలో రంగారాయుని పాత్ర

- శ్రీ రొందువ జగన్నాథనాయుడు, ఎం. ఏ.

క్రీ. శ. 1652 వ సం॥న బొబ్బిలి రాజ్యమును ప్రప్రథమమున 'రావు పెదరాయడు' అను పద్మనాయక వీర శిరోమణి రాజామును రాజధానిగాఁ జేసికొని స్థాపించెను. అతని కుమారుడు లింగప్ప మొగలుపాదుషాలకు చికాకోలు నవాబులకు తలలోని నాలుకగా ప్రవర్తించిన వాడు. షేర్ మహమ్మద్ ఖాన్ కుమారుడు వేటకై దూరసీమల కరిగినపుడు పితూరీదారు లెవ్వరో అతనిని బంధింపగా, లింగప్ప పితూరీదారులను చెఱపట్టి ఖానుని కుమారుని విడిపించి నవాబు మన్ననలను బడసెను. దీనికి ప్రతిఫలముగా లింగప్ప రాజామునకు పశ్చిమ దిశను ప్రస్తుత బొబ్బిలి నగరమువరకు గల ప్రదేశమును పంద్రెండుపోటుగ్రామములను నవాబునుండి బహుమతిగా పొందెను. ఈ సంఘటనము శ్రీకాకుళము మండలమునందలి పలాసాకు దగ్గరలో గల 'రంగవాక' అనుచోట జరుగుటచే దీనిని పురస్కరించుకొని నవాబు లింగప్పకు 'రంగరాయ' బిరుదమును ప్రసాదించెను. అప్పటినుండి లింగప్ప వంశీయులీబిరుదమును పౌరుష చిహ్నముగా దమ నామముల చివర ధరించుచు వచ్చిరి.

షేర్ అను ఉర్దూపదమునకు బెబ్బులి (పెద్ద + పులి) అని అర్థము కనుక లింగప్ప తన యేలిక యగు షేర్ మహమ్మదు ఖానుని నామస్మృతిగా 'బెబ్బులి' అని తాఁగట్టించిననగరమునకు నామకరణ మొనర్పగా; నయ్యది ప్రజలనోటఁ బడి క్రమముగ బొబ్బిలిగా మారెను. ప్రపన్న పారిజాతావతారికలో కూడ నిట్లే చెప్పబడినది. క్రిందిపద్యము గమనింపదగును.

'షేరన దురుష్కభాషను తెలుగున బులి
పెద్దపులియును పద మర్యో బెబ్బులి యన
బెబ్బులిరాయ నాడు నాటికి బొబ్బిలి యన
బొలిచెనక్షరములు మార్పుబొందనిపుడు'

గజపతి నగరము, చికాకోలు, చీపురుపల్లి, పార్వతీపురము, పాలకొండ, సాలూరు తాలూకాలమధ్య నేటి విజయనగరమండలమునందు బొబ్బిలి జమీందారీ వ్యాపించియుండినది. విశాఖపట్టణమునకు నైరృతి దిశలో డెబ్బది మైళ్ళదూరములో బొబ్బిలి పట్టణమున్నది.

సుమారు 222 సంవత్సరములకు పూర్వము (క్రీ. శ. 1757 లో) విజయనగరమును పాలించుచున్న పూసపాటి

విజయరామరాజు బుస్సీదొర సాయముతో తనపొరుగు సంస్థానమైన బొబ్బిలి కోటను ముట్టడించిన కథ యిందలి యితివృత్తము. ఈ బొబ్బిలి కథకు పదములలో రెండు భిన్నరచన లున్నవి. ఒకటి పెద్దాడ నాగేశంపమారుడు మల్లేశం వ్రాసినది. వేరొకదానికర్తపేరు తెలియదు. ఈ రెండుగ్రంథములు సాధారముగా రంగారాయునిపాత్ర చిత్రించుట యీవ్యాస ముఖ్యోద్దేశము.

బొబ్బిలిపాలకులు వెలమ దొరలు. అత్యంత ప్రతాపాఢ్యు అయిన ఈదొరలలో రావువారు బలవంతులు. లింగప్ప అనంతర మహారాజవంశమున నాల్గవతరమువాడగు రాజా గోపాలకృష్ణ రంగారావు చరిత్రప్రసిద్ధుడు. ఈతని పాలనాకాలమందే ప్రఖ్యాతికెక్కిన బొబ్బిలి యుద్ధము జరిగినది. పద్మనాయకుల ధైర్య స్థైర్య శౌర్య సాహస వీరప్రతాపములు ప్రదర్శింప బడినవి.

పద్మనాయక వీరనారీమణుల యాత్మగౌరవము నిరూపితమైనది. రంగారాయుడు గొప్పవీరుడు. శౌర్యముకలవాడు. ధైర్యవంతుడు. అందమైనవాడు. పౌరుషమంటే తమదేయనుకొనిన వెలమవీరులలో లెక్కింప దగినవాడు. అయినను తొందరపడువాడుకాడు. నిదానమే ప్రధానమని తమ్ముడు వెంగళరాయునికి, బావమరది ధర్మారాయునికి చెప్పిన వివేకశాలి 'వగడశాల అడి నేను సామును పోతిని' అనువాక్యమువలన నితనికి సాముకూడ వచ్చు నని తెలియుచున్నది. విజయరామరాజు బుస్సీతో కలిసి, బొబ్బిలిమీదికి యుద్ధమునకు వచ్చుచున్నా డని రంగారాయుడు తెలిసికొని తమ్ముడగు వెంగళరాయునితో___

పరాకుంచక వినుము యిపుడు వెంగళ
రాయుడా
మన యుంబయూదక దండు తెచ్చెను
విజేరామరాజు
మనలను చంపి బొబ్బిలికోట యేల
దలచినాడు
ఇక్కడ యుండగదయ్యా బొబ్బిలి
కోటలో
నల్లమందుగుండుగోను ప్రాంచి వచ్చాడు
నల్లమందుగుండుకు ముందుక త్తిరియెత్తరాదు
చేతితో యుద్ధము మనము యిక చేయలేము
కోటలకంతా బోరు సింహాము
పాపారాయుడు
ప్రాణంవంటి నా బావమరదిగ తాండ్ర
పాపయ్య
అతను పోయి రాజారపు కోటలో
రాజావున్నాడు
పాలకోలు మండ్యాలం మనము
బాగుచేసుకొని
రాజస్త్రీలపిలుచుకొని వల్సలు జోతామా
ప్రాంచివచ్చి రాజుకపట్టముగట్టిపోతాడు
వెనుకవచ్చి చెంపలుకొట్టిబొబ్బిలితీతాము'

అని చెప్పినాడు. రంగారాయుడు బాగుగానాలోచించి పలికిన మాటలివి. పౌరుష మంటే తమదేయనుకొనిన వెలమవీరున కిట్టి అలోచన కలుగుట అతని రాజ్యక్షేమమునకే. రంగారాయుడు అనుకొనునట్లుగా బొబ్బిలి వెలమవీరులు మెలగినచో బొబ్బిలి వారంతా చనిపోయెడివారుకారు. ఆపదసమయమున మనస్త్రీలను వెంట బెట్టుకొని వలసలుపోయి, సమయము కని పెట్టి మరల మనబొబ్బిలికోటను వశపరచుకొనవచ్చు నని రంగారాయుడు చెప్పగా; విన్న వెంగళరాయుడు మనము పోయిన వెనుక బ్రతికియుండుట సరిగా దనియు, నాకు సెలవిచ్చిన రెండు గడియలలో శత్రుసైన్యమును చెండాడెద ననీ వీరావేశముతో పలికినాడు. ఆసమయమున రంగారాయుడు___

'తాలిమినుమ్మీ ఓరుపుసుమ్మీ వెంగళ
రాయుడా
తాలిమి అన్నది తనను గాచును రొదిరి
గాచు నేమి?
ఓరుపన్నగిబల్లు కాచును వెంగళరాయుడా
అవసరపడితే పనులు కాదుర వెంగళ
రాయుడా
దామెర్లవారిధర్మారాయునిసంధికిపంపితే
రాయబారము తీర్చుకొని దా రాయుడు
వస్తాడు
రాయబారము కుదరకపోతే పిమ్మట
చూతాము'

అని తమ్మునితో పలికినాడు. పై వాక్యములలో రంగారాయుని వివేకము, రాజనీతి చాతుర్యము కనబడుచున్నవి సామదానభేద దండోపాయములతో కార్యసఫలతకు పాటుపడుచున్నాడు.

ధర్మరాయుని బుస్సీయొద్దకు రాయబారమునకు పంపుసందర్భమున, ధర్మారాయునితో రంగారాయుడు బుస్సీ తూర్పుదేశము చూచుటకు వచ్చిన విషయము, యెదురుసేవకు విజయరామరాజు బొబ్బిలివారికి పంపిన జాబు విషయము, జాబును వెంగళరాయుడు చించి జాబు తెచ్చిన హర్కారుల చెంపలు వాయించి మెడబట్టి నెట్టించినవిధము, చెప్పి;విజయరామరాజు కోపముతో బొబ్బిలి మీదకు యుద్ధమునకువచ్చుచున్నా డని చెప్పెను. విజయరామరాజుకు కలిగిన కోపకారణముల నిట్లు చెప్పుటలో రంగరాయుని లోకజ్ఞత వెల్లడి యగుచున్నది. అంతే కాదు. ధర్మారాయుని బుస్సీ భేటికి పోవలసిన దని, వారి భాష మనకు తెలియదుగనుక అచట నుండు దుబాసి లక్ష్మయ్యను కలిసి మాటలాడి బుస్సీతో భేటీకుదుర్చుకొమ్మనినాడు. రాజమహేంద్రవరమునుండి బొబ్బిలికరకు మజిలీకి వెయ్యేసి రూపాయిలు చొప్పున యిచ్చెద మని యు, బిడ్డలు, బాలింతలు, ముసలివారితో కోటలో యున్నా మనియు, రాజాగారికి మాకు చాలరోజులుగా పగయున్న దనియు, ఫ్రాంచివారికి మాకు పగ లే దనియు, తూర్పుదేశము చూడవచ్చినవారు గనుక మీరు మాతో జగడమునకు రాక

...మిచ్చి బహుమతులను గైకొని మా బొబ్బిలికోటను తున్నించి మీ పూరికి పోవసిన దనియు బుస్సీతో చెప్పి, సంధిపదు చుకొని రమ్మని రంగారాయుడు పలికినాడు. అట్లు రాయబారము కుదరనిచో పిమ్మట చేయవలసిన కార్యము ఆలోచింపవచ్చు ననినాడు. ఇట్లనుటలో రంగారాయుడు యుక్తిపరు డని తెలియుచున్నది.

రంగారాయుడు రాయబార మంపి సంధి కుదుర్చు కొనుటకు ప్రయత్నించినాడు. సఫలము కాలేదు. తన బావమరది యగు పాపారాయుడు లేనందువలన బొబ్బిలికోట తలుపులు తీసియున్న ట్లున్నదని భావించి రహస్యముగా పాపారాయునికి జాబు వ్రాసినాడు. జాబు చేర లేదు. చివరికి యుద్ధము తప్పలేదు.

'...మను మేల యింక నాకు సెలవులివ్వండి'

అని వెంకళరాయుడనగా, అపుడు రంగారాయుడు తమ్మునితో –

'పరాకించక వినండి మీరు
వెంకళరాయుడా
...తో యున్నది నీతో యున్నది
బొబ్బిలి కోటగా
మీదు బలమంతా జూపండయ్యా
దండుకు లోగాను
ముందు వెనుక జూడరాదు వెంకళ
రాయుడా'

అని వీరావేశముతో పలికినాడు. యుద్ధములో వెంకళరాయుడు మూర్ఛపోవుటను రంగారాయుడు విని ఘోరముఘోరమున దుఃఖించి'

'కుడిభుజము కూలిపోతివా
వెంకళరాయుడా
యెంతటిదండు లోపల పోరు చేసితివి
వెంకళరాయుడా'

అని యెంతగానో వాపోయినాడు.

రంగారాయుని భార్య దేవిమల్లమ్మ కుమారుడు వెంకట్రాయునితో రంగా[illegible]

రంగారాయుడు, చేతులార కుమారు నెత్తుకొని –

'కారణాలు యీలాగు నుండెనో
మానాయన నీకు
మాతండ్రిగారి పేర్పెట్టుకొంటిని
వెంకట్రాయుడా
కోటలోపల అదృష్టవంతులు
ఒకరూ లేరైరి
గడకో గడకో పరాసు అన్నము
తినక తీరదేమి
ఇంకా మీరు బ్రతికి యుండుకు
వెంకట్రాయుడా'

అని మొలలోనున్న బాకునుతీసి వెంకట్రాయుని ఎగురవేసి నరకబోయెను. రంగయ్యదొరగారు మిగతా వెలమవీరుల నిలిచి మీమీ బంధకములు వదలించుకొని రండి యనగా వారుపోయి వారి వారి భార్యలను బిడ్డలను జంపి తిరిగి కొలువునకువచ్చిరి. రంగారాయుడుకూడా భార్య మల్లమ్మదేవిని, కుమార్తె సుందరమ్మను ఇంకను కొంతమంది అంతఃపుర స్త్రీలను గొంతులుకోసెను. పద్మనాయక వీరనారీమణులు పరాసువారి చేతిలో పడకుండుటకు తామే స్వయముగా అంతఃపుర స్త్రీల గొంతులుకోసిన పౌరుషవంతుడు రంగారాయుడు.

కోటవిడిచి రంగారాయుడు బయటకు వచ్చి కోటకు వందనము చేసి

'నేటివరకు మాకు కోటకు ఋణముదీరెను
అన్నలార తమ్ములార వెలమబిడ్డలార
ముందు వెనుక జూడవలదు
దండుకు లోగాను
మీరుబలము జూపండయ్యా దండుకు
లోగాను
అనంతకాలము బ్రతికి మనము
రాజ్యమేల లేము
చచ్చినవారికి వీరస్వర్గము
యిక్కడ కలుగును'

అని రంగారాయుడు వెలమవీరులకు [illegible] రంగారాయుని మాటలు విన్న వెలమవీరులు ధైర్యము తెచ్చుకొని చుట్టుకున్న ఫ్రెంచిదండుపై బడిరి. బొబ్బిలిదండు గొర్రెలమందలో దూరిన తోడేళ్ళలాగు ఫ్రెంచిదండును దునుమాడగా వారితో పోరాడలేక ఫ్రెంచివారు కొండచాటునకు పారిపోయిరి. అపుడు రంగారాయుడు 'సమాన వియ్యము సమానకయ్య' మనునట్లు ?

'వీరిని చంపితే సార్థకమేమి
వెలమబిడ్డలారా
రాజుగారిని చంపితేను పేరు కలుగును
ప్రాంచివారిని చంపితేను పేరు కలుగు
మనకు'

అనినాడు. రంగారాయుని యుద్ధనైపుణ్యమును హైదరుజంగుద్వారా బుస్సీ తెలిసికొని, హర్కారులతో బుస్సీ –

'కోలు కోలుకోలు యంటు యెదురుగ
పోన్నండి
యేమికోలు యని యడిగితె రంగయ్య
దొరగారు
యెప్పటివలెనే బొబ్బిలికోటలు
యేలుకొన్నండి
మళ్ళ ప్రత్తరము తెన్నండోయి
హర్కారులా మీరు'

అని చెప్పి పంపినాడు. హర్కారులు రంగారాయుని సమీపించి పైమాటలు అనగా 'అన్నదమ్ములు, బావమరదులు, బంధువులందరు చచ్చినవెనుక యొంటరిగాడనై నిలిచిన నాకెందు' కని రంగారాయుడు తన సైన్యములను హెచ్చరించి తానును సమరము చేయుచున్నాడు.

పై వాక్యములలో రంగారాయుడెంతటి వీరుడో, ధైర్యసాహసములు గలవాడో తెలియుచున్నది. రంగారాయుడు యుద్ధము విరమించడని బుస్సీ తెలిసికొని కొండప్రక్కకు పోయినాడు. విజయరామరాజుకూడా డేరాను విడిచి యుద్ధభూమినుండి తొలగినాడు. రంగారాయుడు బుస్సీ డేరాయొద్దకు వెళ్ళి –

'పిరికిబంటు వీడు యిపుడు
యెందుకు వచ్చాడు
మీసములేని పేడివాడు
యెందుకు వచ్చెను'

అని కోపగించుకొని డేరాను క్రిందు మీదుగా జేసి విజయరామరాజు డేరా వద్దకు వెళ్ళిచూడగా డేరాలో రాజు కన బడలేదు.

'బొబ్బిలివారిబలము నీకు తెలిసియున్నాది
నీ తాతతండ్రులు బొబ్బిలిమీద
హతమైపోయిరి
పుట్టినచోట చావడానికి
బ్రహ్మ వ్రాయలేదు
బొబ్బిలిమీద చావడానికి
బ్రహ్మ వ్రాసినాడు
హీనమానము లేక యిపుడు
యెందు కొచ్చితివి'

అని విజయరామరాజును దూషించి రాజు డేరాను క్రిందుమీదుగా జేసినాడు. తన తమ్ముని మరణమునకు లాల్ ఖాను దే కారణ మని తెలిసికొని పట్టరానికోపముతో లాల్ ఖాను డేరాయొద్దకు వెళ్ళి లాల్ ఖానుని చంపినాడు.

హైదరుజంగు ఇంకను బొబ్బిలివారిని చేతి జగడంబున జయించలే మని నల్లమందు ధూమిని పటిచి నాలుగువైపుల నిప్పంటించగా ఆమంటలో వెలమబిడ్డలు చనిపోగా రంగారాయుడు మాత్రము మంటనుండి బయటపడి రాగలిగినాడు. మంటపెట్టినవారిని గొంతులుకోసే వీర విహారము సలుపు చున్న రంగారాయుని తుపాకులతో కాల్చసాగిరి. దేహమంతట యెన్నరాని గాయములు తగిలి ప్రేగులు బయటికి బయల్పడగా, జీరాడు ప్రేగులను యెత్తి దట్టిలోగట్టి యినుమంతయుజంకక శౌర్యముతో శత్రుసైన్యములను చెండాడి మరి నిల్వలేకపోగా విరోధులచేత జిక్కకుండ తనచేతి బాకుతో గొమ్మునపొడుచుకొని భూమిపైపడి ప్రాణములు విడిచెను. రంగారాయుడు చనిపోయినా డని

# చిట్టి చీమ

శ్రీ డా. ఎస్. గంగప్ప,
ఎం.ఏ., పిహెచ్.డి.

చూశారా చిట్టి చీమను
చుట్టూతా తిరిగితే చీమను ॥చూశారా॥

తీరిక లేదు సుంత
నిలకడలేదు ఇంత
తిరుగుతూ ఉంటుంది వింత
శ్రమించటమే దాని చింత ॥చూశారా॥

వెళ్లదు ఎప్పుడూ ఒక్కటి
వెళతాయి ఒకే బెంబడి ఒకటి
సంఘీభావం నేర్పుతుంది చీమ
చక్కగాను నేర్వాలి మనమెంతో ప్రేమ.
॥చూశారా॥

(నా 'బాలగేయమాల' నుంచి)

---

ఢంకా మ్రోయగ బుస్సీ, విజయరామరాజు వారి సైన్యము వచ్చి రంగారాయుని చూడసాగిరి.

రంగారాయుడు గొప్ప అందగాడని పరాయివాడు, ఫ్రెంచివాడగు బుస్సీ మాటల వలన తెలియు చున్నది. రంగారాయుని వీరచిహ్నములు చూచి.

'ఒడ్డుపొడుగు చక్కదనము కన్నుల
జూచెను
వీపునందువింజామర లే రంగయ్య దొరగారు
బొడ్డునందు చింతామణియు రంగయ్య
దొరగారు'

అని బుస్సీ దుఃఖించినాడు. క్రూరకర్ముడు, పరద్రోహి పాపిష్టి విజయరామరాజు మాటలను విని ఇటువంటి వస్తాదుబిడ్డను బోగొట్టుకొంటి నని చింతించి రంగారాయుని దేహమునకు వీరులకు చేయదగిన మర్యాదలతో దహనసంస్కారము చేయించెను. సకలమర్యాదలతో రంగారాయుడు వీరస్వర్గ మలంకరించెను.

* * *

# మార్పు

– శ్రీ వెలుదండ రామేశ్వరరావు
ఎం.ఏ., బి.యిడి

'ప్రతిపదాదిగ పౌర్ణమి వరకు మరల
ప్రతిపదాది నమావాస్య వరకు గూడ
మార్పు లందుట చేతనే మనకు మిగుల
నందమై తోచు చంద్రుండు డెందమంచ

* కాలవాహిని ఋతువుల పూలపళ్ళె
రము లహరహముపయనించి రక్తిగూర్చు
మార్పులందుట చేతనే మనకు ప్రకృతి
మిగులనుపయోగపడుచుండి మేలుగూర్చు

*తనుమనోధనంబులుకూడ తరచుమార్పు
లందు చుండుట చేతనే యందగించు;
మార్పులే నిత్యనూతన మహిమ సొబగు
నింపు వినుగు విసుమవల కంపి వేయు॥

* ప్రాత నేలను క్రొత్తవౌ పైరులేపుడ
పచ్చపచ్చగ పెరుగుటే ముచ్చటగును,
ప్రాతకొత్తల కలయిక బ్రతుకులందు
నభ్యుదయమార్గముల్ వేయు ననుదినంబు

*పానపాత్ర యిచట ప్రాత దేయగుగా
పానయోగ్య మధువు దీన క్రొత్త;
ప్రాతదైన మధువు బహుక్రొత్త పాత్రల
నింపబోవ నదియు నింపు గూర్చు॥

* మార్పు లెల్లను సహజంపు మార్పులై
ప్రకృతికోధను హెచ్చింపం బాలుపడు
మార్పు లనువవియే కృత్రిమమ్ములైన
ఘోర పరిణామముల కెల్ల కారణ మగు

* సహజ పరిణామ సరళిచే సరసిజాళి
సరసులకు నందముల్ గూర్చు నరసి చూ
కాల మదహస్తి కర పాద ఘట్టనమున
కల్గుమార్పు లాయందంబు కడల కంపు

* మార్పు లెన్నెని వచ్చిన మార్పులేక
మనసు సరిపెట్టుకొని పోయిపనులు సేయ
ధీరు లిప్పుడు గావలె దేశమునకు
వారి వలననే దేశంబు బాగుపడును.

---

# గాంధారి పతివ్రత - కుంతి పరమ పతివ్రత

- శ్రీ మోపిదేవి కృష్ణస్వామి, ఎం. ఏ.

పాతివ్రత్య విషయమునగూడ భారతమున వివిధ సన్నివేశములలో చక్కని ధర్మాద్వైతస్థితి ప్రతిపాదింప బడినది. ఆయా సన్నివేశములను సమన్వయించి చూచినచో మన కీ ధర్మాద్వైతస్థితి తేటతెల్లము కాగలదు. తొలుత కుంతీ, గాంధారుల పాతివ్రత్య విషయమును పరిశీలింతము.

తనను తండ్రి జాత్యంధుడైన ధృతరాష్ట్రునకు ఈయబోవుచున్నాడని వార్త విన్న గాంధారి తండ్రి నిర్ణయము ప్రకారము తనను ఆక్షణమే ధృతరాష్ట్రునకు సమర్పించుకొని భర్త చూడలేని లోకమును తానుగూడ చూచుట కిష్టపడక కన్నులకు వస్త్రము కట్టుకొన్నది. ఆపైని గాంధారీ ధృతరాష్ట్రులకు వివాహము జరగినది. జీవితాంతము తన కన్నులకు వస్త్రము కట్టుకొనియే యున్నది గాంధారి.

ఇక కుంతి. తనకు దుర్వాసు డిచ్చిన వరము పరీక్షింపగోరి యిట్లు చేసెనుగాని తనకట్టికోరిక లేదని కుంతి వివరించి చెప్పుటయు, తనరాక వ్యర్థముకాదని ఆమె కన్యాత్వమునకు భంగము కలుగకుండ సూర్యుడు పుత్త్రుని సద్యోగర్భమున ప్రసాదించుటయు. జరగినది.

కుంతికి పాండురాజుతో వివాహమైనది. కిందముని శాపమువలన సంతానము పొందుటకు అవకాశము లేని పాండురాజునకు పుత్త్రసంతతి కావలెనని కోరిక కలిగినది. జీవితమున నిజమగు తృప్తిని పొందుటకుగాని, వంశము నిలుచుటకుగాని, పితృ ఋణముతీర్చుకొనుటకు గాని పుత్త్రసంతతిని పొందుట యొక్కటే మార్గమని నిశ్చయించుకొనినాడు పాండురాజు.

కుంతిని దేవరన్యాయమున పుత్త్రులను పొంది తనకు తృప్తిని, ముక్తిని కలిగించవలసినదిగా కోరినాడు పాండురాజు. కుంతి పాండురాజున కంకితమైన మనస్సున మరియొక మూర్తిని నిలుపలేనన్నది. సంతతి పొందుటకు మరియొక పవిత్రమార్గమున్నదని వ్యుషితాశ్వుడను రాజుకథను భర్తకు వినిపించినది. వ్యుషితాశ్వుడనురాజు తన పత్నియైన భద్రయందు అనవరత కామాసక్తుడై క్షయవ్యాధితో మరణించెను. అప్పుడు భద్ర భర్త శవమును కౌగలించుకొని రోదించుచు 'నిన్ను విడచి యుండలేను. నీతోడనే నేనును వచ్చెదను. అట్లు కాదన్నచో నీ ప్రతిరూపులైన పుత్త్రులనైనను నాకు ప్రసాదింపుము' అని కోరినది. 'తప్పక పుత్త్రు లుదయింతురు. ఋతుమతివైన యెనిమిదవ రోజునగాని, పదునాల్గవ రోజునగాని శుచివై శయనమందుండి నన్ను తలంపుము.' అని భర్తశరీరమునుండి భద్రకు దివ్యవాణి వినిపించినది. ఆమె యట్లే చేసి యేడుగురు కొడుకులను పొందినది. ఈకథ చెప్పి కుంతి 'నీవు కూడ మాయందిట్లే పుత్త్రులను అనుగ్రహించవలసిన' దని ప్రార్థేయ పడినది.

అప్పుడు పాండురాజు వివాహవ్యవస్థ రూపుకట్టుకొన్న విధము వివరించి, 'భర్తచేత నియోగింపబడక పతి యేమియును చేయరాదు. భర్తచే నియోగింపబడి చేయకుండుట సతికి దోషము' అని మనువు చెప్పిన ధర్మమును వివరించి, 'పూర్వము కల్మాషపాదు డను రాజర్షిచే నియోగింపబడి వాని భార్య మదయంతి వసిష్ఠుని వలన అశ్మకుండను పుత్త్రుని పొందినది. చూడగా మా జన్మముకూడ నిట్టిదేకదా! మహాముని యగు వేదవ్యాసుల వలనగదా మా వంశము నిలిచినది. ఈ సన్నివేశములను బట్టి సత్యము నెఱింగి బోధపరచుకొన్నదానవై నా నియోగమునే చేయవలసినది' అని కుంతికి నచ్చచెప్పి పాండురాజు పుత్త్రసంతతిని పొందితీరవలెనను కోరిక తనకు మిక్కుటముకాగా భార్య నిట్లు ప్రార్థించుచున్నాడు.

'అలయక ధర్మశాస్త్రముల
యందు బురాణములందు జెప్పను
త్పలదళ నేత్రవింటిమ యప
-త్యము మే లని కావునన్ యశో
నిలయుల బుత్త్రులం బడయు
నీ కొనరించెద సంగతాంగుళీ
దళ విలసన్మదీయకర
తామరసద్వయ యోజితాంజలిన్ !'

ఇట్లు నమస్కరించి దీనవదనుడై ప్రార్థించుచున్న భర్తను చూచి, భర్తకు సంతతిని ప్రసాదించుటయే తనకు కర్తవ్యమని నిర్ణయించుకొని కుంతి దుర్వాసు డిచ్చిన వరప్రభావమును అతనికి తెలిపినది. అతని కోరికపై నియోగింపబడి ధర్మ, అనిల, శక్రుల నుండి ధర్మజ, భీమార్జునులను పొందినది.

మాద్రి తాను పుత్త్రులను పొందవలెనన్న కోర్కెను పాండురాజునకు విన్నవింపగా, పాండురాజు కోరికపై దుర్వాసుడు తన కిచ్చిన మంత్రమును మాద్రి కుపదేశించినది కుంతి. ఆ మంత్ర ప్రభావమువలన భర్త నియోగముపై అశ్వినీదేవతలను ప్రార్థించి నకుల సహదేవులను పొందినది మాద్రి.

కుంతికి పుత్త్రసంతతి కలిగిన దన్నవార్త విని ఉదరతాడనము చేసికొన్నది గాంధారి. తత్ఫలితముగా గర్భపాతమైనది. వ్యాసుని కరుణవలన ఆ మాంసపేశినుండి నూర్గురు పుత్త్రులు, ఒక్క కుమార్తెయు జన్మించిరి.

తనవలెనే తన సవతికి గూడ సంతతి కలగవలెనని కోరినది కుంతి. దుర్వా

రుడు తన కిచ్చిన మంత్రమును తాను గురువై సవతి కుపదేశించినది. తోడికోడలికి తన కన్న ముందు సంతతి కలిగిన దని ఈర్ష్యతో ఉదరతాడనము చేసికొన్న గాంధారి సామాన్య స్త్రీ స్వభావమును ప్రదర్శించగా, సవతికే మంత్ర మువదేశించి తదతీత స్వభావమును చూపినది కుంతి.

భారత కథను సమగ్రముగ, సమన్వయాత్మకముగ పరిశీలించినచో కుంతి యొక్క పవిత్రత ఉత్తమత్వము మనకు గోచరింపగలవు. ఆమెలో కామవాంఛ యున్నటులు కనబడదు. సూర్యుడు దిగి వచ్చిన నాడును ఆమె కొట్టికోరికయును కలుగలేదు. వరమును పరీక్షింపగోరి మంత్రము నుచ్చరించితిని గాని మరియే యుద్దేశముతో కా దని సూర్యునకు వివరించి, తనను వదలి వేయవలసినదిగా వేడుకొన్నది కుంతి. తనరాక వ్యర్థము కాదనియు, సద్యోగర్భమున పుత్త్రుడు కలుగు ననియు, కన్యాత్వమునకు మాత్ర మెట్టి భంగము కలుగ దనియు నచ్చ చెప్పినాడు సూర్యుడు. పుత్త్రుని ప్రసాదించినాడు. ఈ సన్నివేశమున కుంతికి కామవాంఛ అణుమాత్రముకూడ లేక పోవుటవలననే ఆమె కన్యాత్వమునకు భంగము కలుగకుండుటగా చెప్పినట్లు కనిపించును. ఈరీతిగనే యమ, అనిల, ఇంద్రులనుండి పుత్త్రులను పొందు వేళకూడ ఆమె మనస్సునకు కామస్పర్శ లేదు. భర్త అప్పగించిన బాధ్యతమాత్రమే ఆమె మనసున నిండియున్న దని మనము గ్రహింపవలసియున్నది.

ఇట్టి పవిత్రమూర్తి కనుకనే దుర్వాసుడా మెకు వరము ననుగ్రహించుటయును, మంత్ర ప్రభావమున ఆవాహన మాత్రమున దేవత లామెకడకు నడచి వచ్చుటయును, ధర్మతేజో మూర్తులయిన ధర్మజ భీమార్జునులు ఆమెకు తనయులై జన్మించుటయును, జరిగిన దని సూక్ష్మ దృష్టితో పరిశీలించిన తెలియగలదు.

భర్త చూడని లోకమును తానుకూడ చూడ జాలదని కన్నులకు వస్త్రము కప్పుకొన్న గాంధారి పతివ్రతాధర్మమునే అవలంబించినది. భర్తృప్రీతికొరకు తనను తాను త్యాగము చేసికొనిన కుంతి అంతకు మించిన పతివ్రతాధర్మము నాచరించినది.

ఇచ్చట సూక్ష్మముగా పరిశీలించిన ఒక సత్యము దర్శన మిచ్చును. భర్తకు కన్నులు లేవని తానుకూడ కన్నులం కప్పుకొనుట మేలా? తన కన్నులతో భర్తకు కన్నులు లేని లోటును తీర్చుట మేలా యని ఆలోచించిన గాంధారి అనుసరించిన మార్గపు తీరుతెన్నులు మనకు బోధపడగలవు. తన కన్నులతో భర్తను నడిపించవలె నని ఆమెకు ఊహ రాలేదు. ధృతరాష్ట్రునకును అట్టి సంకల్పము కలుగలేదు. విచిత్రము.

కుంతీ పాండురాజుల దాంపత్యము వివేకమునకు నెలవు.

గాంధారి పాతివ్రత్యము భౌతికముగా ప్రాధాన్యము వహింపగా, కుంతీదేవి పాతివ్రత్యము మానసిక కక్ష్యకు సంబంధించినదై ఉన్నతము, ఉత్తమము, కూడ నగుచున్నది. నిజమునకు పతివ్రతాధర్మ మనునది మానసికమే కాని కేవల భౌతికముకా దని భారతము ధర్మాద్వైతస్థితిని ప్రతిపాదించుచున్నది.

కుంతికివలె నిర్బంధ స్థితిలో పర పురుషస్పర్శ పొందవలసివచ్చినను ఆ స్త్రీని అవమానింప వలదనియు, మానసికమగు పవిత్రతకే ప్రాధాన్య మిచ్చి ఆమె కన్యాత్వమునకు భంగము కలుగ లేదని గ్రహించవలెననియు భారత ముపదేశించినది. అట్లు స్వీకరించినాడు కనుకనే భారతకర్త కుంతీదేవికి పాండు రాజుతోడి వివాహమును వర్ణించుచు

'యదుకుల విమల పయఃపయోనిధి సుధా
కరరేఖఁ గమనీయ కాంతి నిలయ
ననవరతాన్నదానాభితర్పిత ముని
విప్రజనాశీః పవిత్రమూర్తి
వినయాభిమాన వివేక సౌజన్యాది
సదమల గుణ రత్న జన్మభూమి
బరమ పతివ్రతాభరణాభిశోభితఁ
దామరసేక్షణ దాల్మి యందు
బృథివిఁ బోనిదానిఁ బృథ యను కన్యక
నధిక వీర్యుఁడై స్వయంవరమున
బడసి పరనరేంద్ర పరిభావియప్పాండు
వరుడు పేర్మితో వివాహ మయ్యె.'

అని కుంతిని నోరార కీర్తించినాడు. కుంతిది కేవల పాతివ్రత్యము కాదు. పరమ పాతివ్రత్య మని వర్ణించుట పాతివ్రత్య సంప్రదాయమున సూక్ష్మదృష్టిని ప్రసరింప జేసి ధర్మాద్వైత స్థితిని స్థాపించుటకొరకే.

—•••—

## బీజధ్వని

శ్రీ కె. వెంకట్రామయ్య, ఎం.ఏ:

ఇది చిరుగాలే
అయినా చిరుకోపం వస్తే
ప్రచండ ప్రభంజన మౌతుంది.

ఇది మబ్బుతునకే
అయినా వాతావరణం మారితే
గర్జించి పిడుగులు కురిపిస్తుంది.

ఇది నీటిబొట్టే
అయినా కలత వేస్తే
అల్లోల సాగరమై ముంచేస్తుంది.

ఇది విస్ఫులింగమే
అయినా ఆగ్రహం వస్తే
దావాగ్నిలా దహించేస్తుంది.

ఇది జనబీజమే
అయినా చైతన్యం తేమ తగిలితే
మొలకెత్తి మహావృక్ష మౌతుంః

—•••—

# "బసవరాజు" వారి గీత పారిజాతపరిమళాలు

- శ్రీ డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం.ఏ.,పిహెచ్.డి.

'వన్నెవ్వ రాపలే రీవేళా
నాధాటి కోపలే రీవేళా
... ... ... ...
పట్టు పట్టుతి నంటె
వాగీశుడే వచ్చి
దాసోహ మని పాట
వ్రాసి వల్లించాలి!'

అని అచంచలమైన ఆత్మవిశ్వాసంతో అభినవంగా అందాల గీత పారిజాతాలను పరిమళింపజేసిన 'భావకవిసమ్రాట్' బసవరాజు వారి కవితాసామ్రాజ్యానికి 'ప్రకృతి గీతాలు', ప్రణయగీతాలు','భక్తిగీతాలు', 'స్మృతి గీతాలు' - చతురంగ బలాలు. బసవరాజువారి కావ్యాలూ జీవితమూ ఒకటే అని పలువురి అభిప్రాయం. అనుభూతిరాగానే పాటలోనో,పద్యంలోనో ఆవిష్కరించడం అలవాటు కాబట్టే వారి గీతాలలో అంత వాడీ, వేడీ. ఈలక్షణం వల్లనే గీతాలు పాఠకుల గుండెతలుపుల్ని బార్లా తెరచి తిష్ఠవేసుకుని కవిగారికి ఎంతో ప్రతిష్ఠని సంపాదించి పెట్టాయి. వారిగీతాలు చాలావరకు ఆప్తుడితో ఆత్మీయంగా అభిభాషిస్తున్నట్టే వుంటాయి. వారి గుండెలో ఎంత 'ఆర్ద్రత' వుందో గీతాలలో అంత 'రసార్ద్రత, వుంది అర విడిచి ఎన్నో మర్మాల్ని ముమ్మరంగా ముచ్చటిస్తున్నట్టే వుంటాయి. వారికీ కొన్ని ఆదర్శాలు వున్నాయి. వాటిని నిర్మొహమాటంగా లోకానికి అందించే ధైర్యసాహసాలు వున్నాయి. వారి అణువణువులో 'అభినవతామృతం' పొంగి పొరలుతుంది కాబట్టే - వారి గీతపారిజాతాల మకరందానికి అంతటి తియ్యదనం - పరిమళానికి అంతటి కమ్మదనం. వారిగీతాలు అమృత సదృశాలు కనుకనే అవి అజరామరాలు - అవ్యక్తానంద మధురాలు.

"ప్రేమకన్నను యెక్కు
వేముందిరా యెల్ల
కామ్య పదవులకన్న
ప్రేమ యెక్కువరా!
ప్రేమించు సుఖముకై
ప్రేమించు ముక్తికై
ప్రేమించు ప్రేమకై
యేమింక వలయురా!"

'కామం' కన్న 'ప్రేమ' మిన్న - ప్రేమ లేనిదే అంతా సున్న. అనే భావాన్ని కళాత్మకంగా, కవితాకమనీయంగా, రసప్రసన్నంగా, రమణీయార్థకంగా ప్రతిపాదించారు. "ఏమింక వలయురా!" అని కవిగారు నిలదీసి వేసిన ప్రశ్నకు 'బుద్ధి'గా ఆలోచిస్తే 'ప్రేమ' కంటె కావలసింది ఇంకేమీ లేదనేసమాధానమే వస్తుంది. ఎదమెత్తనౌటకై సొదగుందితే, మది గల అహమంతా వదిలిపోతుం దని సరసమైన సందేశాన్ని సహృదయుల కందించి,ఉత్తమ ఔపదేశికు లనిపించుకున్నారు. కావ్యం ఉపదేశాత్మకంగా వుండా లని కదా పెద్దల నిర్ణయం! ఈ లక్షణాన్ని సలక్షణంగా బసవరాజువారు పాటించారు.

"వలపెఱుంగక బ్రతికి
కులికి మురిసేకన్న
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!
చెలి వలపులేని నీ
కలిమి కాల్పనె వినుము
వలపు దీగనె జీవ
ఫలము కాయునురా!"

అని అమలిన ప్రేమతత్వాన్ని అభిజ్ఞ రసజ్ఞ మనోజ్ఞంగా అభివ్యక్తీకరించారు. అసలు బసవరాజువారి ప్రేమతత్త్వం అంతా ఈ చరణాల్లోనే వుంది. 'వలపు' లేని బ్రతుకు నిష్ప్రయోజన మని

వారి అభిప్రాయం. అసలు వలపులేకుండా జీవించటంకంటె, వలచి విఫలమై విలపించటం మేలు అన్నారు. అంటే విఫలత్వాన్నే వారు కోరుకుంటున్నా రని కాదు. ఒకవేళ, అలా జరిగినా ఫరవాలే దని ధైర్యం చెపుతున్నారు. నీచుల్ని ఆశ్రయించి ఫలం పొందటంకన్న, ఉత్తముల్ని అర్థించి విఫలమవటంనయ మని మనకో ఆర్యోక్తి వున్నది. ఆ ఆర్యోక్తి పై చరణాల్లో ధ్వనిస్తున్నది. ప్రేమ అంటే ఏదో ఆకర్షణ, ఆరాధన అని చెప్పటంలేదు. 'వలపు' అని చెపుతున్నారు. ఈ వలపు హృదయ సంబంధమైనది. అంటే ప్రేమ అనేది ఆంతరంగికమైనదే కానీ భౌతికమైనది కా దని తేలిపోతున్నది. ఇదే అమలినప్రేమ తత్త్వానికి దారితీస్తున్నది. 'కలిమి' అంటే 'చెలివలపే' అన్నారు. అదిలేని మిగులినకలిమిని కాల్చమన్నారు. ఫలాల్ని కాసేతీగెలు చాలా వుంటాయి. కానీ అన్నీ లెక్కలోకివస్తాయా! అందుకే 'వలపుదీగెనె జీవఫలము కాయునురా!' అని తమ ప్రేమతత్త్వానికి ఫలశ్రుతి పలికారు.

గుత్తివంకాయకూరలోపల 'వలపంతా' కూరి పెట్టి, పాయసంలో 'ప్రేమ' అనే పాలుపోసి, కరకర వేగిన పూరీలతో పాటు 'కాంక్ష'నుకూడా వేపి, వెన్నెలలో 'కన్నెవల పనే' వెన్న గలిపి, పువ్వుల సెజ్జలో 'యవ్వనమంతా' పొదిపి పెట్టి, వెర్రిప్రేమతో తనబావను ఆహ్వానించిన వెర్రిపిల్లను విచిత్రంగాచిత్రించి కవి గారు ప్రేమకు చిత్రవిచిత్రమైన పోకడను నేర్పారు.

'నగ్నంగా నిజంగా ఉంటుంది ఈయన కవిత్వం. జిలుగూ తళుకూ ఉండవు ఉండడానికి వీలులేదు. ప్రతి భావమూ గుండె చీల్చుకుని దూకుడుగా వస్తుంది. అందుచేతనే ఈయనపాటలలో తొలిచరణాలే గుండె పట్టుకుంటవి. అని 'ముద్దుకృష్ణ' గారు బసవరాజు వారి గీతాలను ముద్దుముద్దుగా అందజేశారు.

ఈ అంచనా అక్షరాలా నిజమని నిరూపించే గీతాలు కోకొల్లలుగా వున్నాయి. వెన్నెపిల్ల అనే గీతంలోని తొలిచరణాలను పరిశీలిస్తే మనకే తెలుస్తుంది.

'గుత్తొంకాయ్ కూరోయ్ బావా!
కోరి వండినానోయ్ బావా!'

నాటినుంచీ నేటివరకూ ఏనాటివరకూ తెలుగునాడంతా విజయతాండవం చేసే చరణాలివి. ఈ పల్లవిని ఎందరో ఎన్నో విధాలుగా వుపయోగించుకున్నా రనేది అందరికీ తెలిసిన విషయమే. పాటే సాంతం తెలియనివాడు సైతం ఈ పల్లవిని కూనిరాగం తీస్తూ ఏవో వూహల్లో వూరేగుతూ వుంటాడు. వెన్నెపిల్ల ఆహ్వానంలోని అమాయికతా, ఆప్యాయతా వీటన్నిటికీ ఒకకారణం కాగా - అందరికీ పరిచయమైన పదజాలం కూర్పులోని నేర్పు మరో కారణమైంది. అసలు వంకాయ కూరంటే-అందులోను గుత్తొంకాయ కూరంటే ఇష్టపడని తెలుగువాడెవడు? దీనికి తోడు వండి వడ్డించేది మరదలు పిల్ల. ఏమాత్రం బెరుకు లేకుండా ప్రేమతో మరదలుపిల్ల ఆహ్వానిస్తుంటే కాదనే మూర్ఖుడుంటాడా!

'గుత్తొంకాయ్ కూరోయ్ బావా!...' లాంటి చరణాలు తొలిచూపులోనే గుండెను పట్టుకొనేవి ఇంకా చాలా ఉన్నాయి. ముందు ముందు వాటినికూడా వుదాహరించటం జరుగుతుంది. కాబట్టి ప్రస్తుతానికి ఇంతటితో ఆపటం సమంజసం. ఇక మరో అంశాన్ని అందుకుందాం.

'చెలియతోడ నిశి ప్రేమ ప్రయాణము
జేయనుంటి నో దేవా
వలపు దీపికలతో మాబాటల
వెలుగజేయు మో దేవా!'

అని తమ ప్రేమ ప్రయాణానికి గమ్యాన్ని చూపించే భారాన్ని దైవానికే వదిలివేసారు. చిన్నవిషయమైనా-పెద్దవిషయమైనా; భగవంతుడితోనైనా-మనిషితోనైనా తామే స్వయంగా - ధైర్యంగా నివేదించుకుంటారు బసవరాజువారు. ఈ సుగుణమే వారికో సుస్థిరస్థానాన్ని సంపాదించి పెట్టింది లోకంలో. పై గీతంలో ప్రేమప్రయాణానికి వలపుదీపికలు కావాలన్నారు. అంటే ప్రేమకు వలపు ముఖ్యమనేది స్పష్టమవుతున్నది. వలపులేని ప్రేమ నిష్ఫలమైనదే కాదు-నిశాసదృశమైన దని కవిగారి అభిప్రాయం. బసవరాజువారు నిర్మించిన అక్షరహర్మ్యాలన్నీ అక్షయరమ్యాలే.

'ప్రకృతి జన్యంబులై
పరమ రమ్యంబులౌ
భావముల నొండొరుల
ప్రణయ మెల్కొడు నట్లు
పల్కరించుచు నుంటిరే,
కోకిలా! పల్కరించుచు నుంటిరే!'

అని కోకిల పలకరింపులకు పులకరించిపోయిన భావుకాగ్రగణ్యులు బసవరాజువారు. పై గీతంలో వినిపించిన ప్రణయ సంగీతం అనంతం. మనుజుల కగమ్యమై, మహితశక్తి గలిగి, పరమామృతము లొలికే ప్రణయ మాధుర్యాన్ని ప్రవహింప చేసారు.

'తాజ్ మహాల్' అనే గీతాపారిజాతం ముంతాజ్-షాజహానుల అఖండ ప్రేమ సౌరభాన్ని విరజిమ్ముతున్నది.

'మామిడిచెట్టును అల్లుకొన్న దీ
మాధవీ లతొకటీ
మే మారెండిటి ప్రేమసంపదా
యింతింతనలేమూ' 2

అంటూ మామిడిచెట్టును, మాధవీలతను; షాజహాను-ముంతాజులకు ప్రతీకలుగా గ్రహించారు. పాపిష్ఠి తుపాను లతను వూడబీకగా, మామిడి చెట్టు మోడయిపోయి మొగము వేల వేసిందని ముంతాజ్ మరణాన్ని ధ్వనింపచేసారు. షాజహాన్ వియోగభారాన్ని, తాజ్ మహాల్ నిర్మాణాన్ని షాజహాన్ మరణాన్ని క్రమదశలలో ధ్వనింపచేసిన తీరు-వినవలసిందే మీరు.

'ముచ్చటైన అవులుకాయ లనే
వెచ్చని కన్నీ ళ్లోడ్చీ
పచ్చనాకుల బొమ్మరింటిలో
పండొక్కటి రాల్చీ
మామిడిచెట్టూ మాధవీలతలో
మాయలో గలసింది.
కామిత మిచ్చే మామిడిపండూ
కవులకు మిగిలింది.'

గీతం మొదటినుంచీ చివరిదాకా ధ్వనిగర్భితంగా నే నడిచింది. ధ్వనిని సాధించటం కోసం ప్రతిభావంతమైన ప్రతీకల్ని గ్రహించటంలో బసవరాజువారి ప్రజ్ఞ ప్రద్యోతమాన మవుతుంది. ప్రేమవిషాదాలను రంగరించి అచ్చుపోసిన సహృదయాలను స్పందింపజేస్తుం దనటంలో సందేహ మేమీ లేదు. మామిడిచెట్టైనా మాధవీలతైనా, మరొకటి- మరొకటియేదైనా మాయలో కలవవలసిందే. ఎంత వేదాంతాన్ని స్ఫురింపజేసారు! కామిత మిచ్చే మామిడిపండూ కవులకు మిగిలిందీ అంటే ముంతాజ్ షాజహానుల పవిత్ర ప్రేమకు ప్రదీపమై 'తాజ్ మహాల్' శాశ్వతంగా నిలిచిపోయింది. 'కామిత మిచ్చే మామిడిపండు' అనటంలోని విశేషం గమనించతగింది. తాజ్ మహాల్ నిర్మాణానికి చారిత్రక నేపథ్యం ఒక్కటే అయినప్పటికీ, భావుకులైన కవులు ఎవరెన్ని దృక్పథాలతో సంభావిస్తే వారికి అలా దర్శనమిస్తూ వారి కామితాలను తీర్చే 'మంత్రఫలమై' మురిపిస్తున్న దనే విశేషార్థాన్ని చెప్పుకోవచ్చు. తాజ్ మహల్ ని చూసే ప్రతివాడికీ రసదృష్టి వుండదు. సౌందర్యభావన వుంటే వుండవచ్చు. అంతమాత్రాన వాడు కవి కాడు. ఒక్క రసదృష్టి వున్న భావుకుడే కవి అవుతాడు. వాడికి తాజ్ మహల్ దర్శనమిచ్చే తీరు వేరు. మరో సామాన్యుడికి దర్శనమిచ్చే తీరు వేరు. ఇంత వ్యత్యాసం వుంది కాబట్టే 'కవులకు మిగిలింది' అని అనవలసి వచ్చింది.

'లేపనైనా లేపలేదే ! మోము
చూపనైనా చూపలేదే !
కోపకారణ మేమొ
యే పాప మెఱుగనే'

అని యశోధర విలపిస్తూ –

'కన్నిబాబా ! నీకు
కలలైన రాలేద !'

అని కన్నకొడుకుని చూసుకొని కన్నీరు కార్చింది. ఏకారణమూ లేకుండానే భర్త తనను విడిచిపెట్టి వెళ్లడం ఏభార్యా సహించలేదు. ఈబాధ ఒక్క యశోధరకే పరిమితం కాదు. స్త్రీజన సామాన్యం. అయినా యశోధరకీ మిగిలిన స్త్రీలకీ తేడావుంది.

ఉంది కాబట్టే 'మోము చూపనైనా చూపలేదే !' అని దీనాతిదీనంగా విలపించింది. కనీసం ఒక్కసారి – వెళ్లబోయేముందు ముఖం చూపించినాఆమె తృప్తి చెందేది. వెళ్ళడం ఎందుకు? ఎక్కడికి? అని ప్రశ్నించేది కాదు. అటువంటప్పుడు భర్త నిష్క్రమణం లోక కల్యాణార్థమేనని తెలిస్తే యశోధరలాంటి పవిత్రమూర్తి అడ్డుపడటం అనే సమస్యే వుండదు. ఆమె కోరుకునేదల్లా ఒక్కసారి భర్తృ ముఖదర్శనం. మరి, ఆదర్శన భాగ్యానికి కూడా నోచుకోలేని యశోధర విలపించటంలో అసమంజసత్వం యేముంది? ఇక తనకు మిగిలించింది భర్త ప్రతిరూపం – తన ఇంటిదీపం. అందుకే కన్నకొడుకులో 'నీకు కలలైన రాలేద!' అని తనదురదృష్టాన్ని చెప్పుకున్నది. భర్త నిష్క్రమించే వేళలో ఆ పసివాడికేమైనా కలలొచ్చి కలతనిద్రలో లేస్తే భర్త మనసైనా మార్చుకొనేవాడు. లేకపోతే కనీసం ముఖమైనా తాను చూసుకోటానికి వీలుండేది. ఇది – ఆమె ఆలోచన, ఆవేదన. ఈవిధంగా వైగీతంలో బసవరాజు వారు వారి కరుణామృతాన్ని వెల్లువలా పాడించారు. యశోధర దీన గాథకు వెలుగు చూపారు. (సశేషం)

1. వైతాళికులు: (కవితా సంకలనం)– ముద్దుకృష్ణ. పుట.

2. ఈ గీతం రేడియోలో లలితసంగీత క్రమంలో మనకు తరుచు వినిపిస్తూనే వుంటుంది. దీన్ని ఎవరెవరు మనకు వినిపించినా– కనిపించేది బసవరాజు వారే.

—···—

## ఆత్మోద్ధరణం

– శ్రీ వసంతరావు వేంకటరావు, ఎం. ఎస్‌సి.

* ఆత్మవిశ్వాస పరమాత్మ విశ్వాసముల్
సడలినవి, బీభత్స మెడదలో చెలరేగ;
అతి శాంతకాసార మట్లున్న మనసులో
నత్యంత సంక్షోభ మప్పుడే జనియించె.

*అదె తడవు గాజువలె హృది
పగిలిపోయింది
మానవత్వపు విలువ మంటలో కలిసింది,
మంచితనం బెల్ల మంచువలె కరిగింది,
కాఠిన్య మేఘాలు క్రమ్ముకొన సాగేయి.

*లోభమాత్సర్యాలు.క్రోధ మోహాదులు న్
శుద్ధ పరమాణు విస్ఫోటనంబటు ప్రేలి
శాంతిసంతృప్తులను సాంతముగ హరియించి
మానవాకార దుర్మార్గునిగ మార్చినవి.

*విశ్వాస పతనాని కిశ్వాస పోసిన
దేశ క్తి? హృదయమం దెట్లు కాలూనినది?
అదియేడ జన్మించె? హృదయమందా? బాహ్య
లోకాలలో పుట్టి లోప్రవేశించెనా ?

*ఇది భరింపగరాని హృదయవేదన, దీని
పరిమార్చి మానవత ప్రకటింపవలె నన్న
ఆత్మశక్తియె శరణ్య మ్మన్య మికలేదు
ఆత్మోద్ధరణ మొకటె,అన్యమార్గములేదు?

—···—

## సంక్రాంతిశోభ

– శ్రీమతి కమలాదేవి.

*  *  *

*మకర సంక్రమణానంద మధురవేళ
గొబ్బి దేవత లెందరో కొలిచినారు
రంగవల్లుల శృంగార మంగళాంగి
లక్ష్మివిహరించు రమణీయ లక్షణముల.

*ఇంతి నవ్వులవలె తోచు బంతిపూలు
హిమసుధావృష్టి కురియు మహీరుహాళి
ధాన్యలక్ష్మికి స్వాగత తరుణ మనగ
కర్షకుల్ చేసి రల్లదె హర్షరవళి.

*కూతు రల్లుండ్ర కులుకులో కోమలతలు
నవవధూవర భావంపు నర్మహాస
మమ్మ తినిపించు విందుల కమ్మదనము
బాలకోత్సాహ పూరిత భాగ్యకళలు.

*'హరిలో! రంగా! హరి!' యనుచు
హాయిగొలుప
తెల్లవారక మునుపె యేతెంచు భక్త
బృందగానాలు మేల్కొల్పు సుందరముగ
తోచె హేమంతకాంత సంతోషరీతి.

*పితృదేవతలకు పూజ ప్రీతిఁజేసి
దానధర్మాలతో జన్మ ధన్యమంద
ఇష్ట దేవతలను గొల్చు ఇచ్ఛమీఱ
బంధుమిత్రుల కూర్చు సంభావకాంతి.

*గొలుపు సంక్రాంతిమురిపాలకున్ బవంతి
రమ్య తేజము లొల్కు పర్వంపు టింతి
తరుణమానసముల కది అరుణక్రాంతి
రాగ భోగ సరాగ విరచిత దాంతి.

—···—

# వామన చరిత్రలో మనచరిత్ర

- శ్రీ కపిలవాయి లింగమూర్తి.

సంస్కృతభాగవతం 'జన్మాద్యస్య యతః' అని బ్రహ్మసూత్రాల్లోని చతు స్సూత్రితో ఆరంభమయింది. దాన్నిబట్టి బ్రహ్మసూత్రాలు ప్రస్థానత్రయంలో ఒక గాబట్టి భాగవతంలో పౌరాణికత్వం పాటు వేదాంతంగూడా ఉందని తెలుస్తుంది. ఈగ్రంథాన్ని ఆంధ్రీకరిం న పోతన మహాభక్తుడు, మహాకవి, బట్టి అతని కథనంలోగూడా మూలం వలె ఉత్తమకవిత్వంతోపాటు గహన మైన తత్వంగూడా చోటుచేసుకుంది. ట్టివానిలో వామనచరిత్ర ఒకటి. మూలంలో అది రెండువందల గ్రంథం. పోతనగారు దాన్ని బ్రహ్మాండాంతసం ర్థిగా పెంచి ఏడువందలు చేశాడు ఇక దానిలోని మనచరిత్ర వినండి.

మానవునికి దేహమనస్సు, అనే రెండు సాధనాలున్నాయి. వానిలో దేహానికి సంబంధించింది భుజబలం, మనస్సుకి సం బంధించింది బుద్ధిబలం. ప్రపంచంలో రెండింటికే ఎప్పుడూ పోటీనడుస్తుంది. కపర్యాయం ఒకటి గెలిస్తే మరొక ర్యాయం మరొకటి గెలుస్తుంది. వాటి యాపజయాలే ఈయితివృత్తం.

మనుష్యునికి బాల్యంలో ఇంద్రియాలు ప్ప ఇంద్రియం ఉండదు. ఇంద్రియాల ర్మం జ్ఞానసంగ్రహణం, ఇంద్రియధర్మం లసంగ్రహణం. బాల్యం గడచిపోగానే యావనారంభమై శుక్రగ్రంథులు పనిచే యట మారంభమవుతుంది. తద్వారా శరీరం బలం పుంజుకుని వికసిస్తుంది. సంపూ ర్ణంగా వికాసం పొందిన దేహబలం బుద్ధి బలాన్ని సాగనీయదు. దాన్ని త్రోసిరా జని తానే పెత్తనం వహిస్తుంది. ఈస్థితిని యవనం కండకావరం అంటాం. అది న్నంతసేపు బుద్ధిబలం ఎక్కడో తల దాచుకోక తప్పదు. తిరిగి అది యావనం ఉడిగే సమయంలో విజృంభించి భుజ బలాన్ని ప్రక్కకునెట్టి మానవుని అన్ని రంగాలను తానే వశపరచుకుంటుంది. ఇక భాగవతకథను చూడండి.

ఈకథలో ఇంద్రుడు బుద్ధిస్థానీయుడు, బలిబలస్థానీయుడు. మనుష్యునికి బాల్యం లో బలంలేదు. అందుచేత మొదట బలి యింద్రునిచే నోడాడు. బలానికి శుక్రా శ్రయం లేక శక్తిలేదు గాబట్టి బలిశుక్రు నాశ్రయించి సత్వాన్నిపొంది విజృంభిం చాడు. దేహబలం విజృంభించినపుడు బుద్ధి బలం పనిచేయదు గాబట్టి యింద్రుడు బృహస్పతియోచనపై కొంతకాలం తల దాచుకున్నాడు. ఆసమయంలో అడవులు పట్టిన బుద్ధిని జ్ఞానంతప్ప మరేదీ ఉద్ధరింప లేదు. అందువల్ల ఇంద్రుని రక్షించటానికి వామనుడవతరించాడు.

దీనిలో వామనుడు జ్ఞానానికి ప్రతీక దానికి తపస్సమాధులు ముఖ్యం. అందుకే ఈకథలో అతని తలిదండ్రులైన అదితి కశ్యపులలో అదితి పయోభక్షణ మం త్రోపదేశ మందిన వ్రతపరురాలుగా కశ్యపుడచ్యుతుని మనస్సున ధారణ మొనర్చిన సమాధిస్థుడుగా చెప్పబడ్డాడు. ఈ జ్ఞానంత్రయీమయం గాబట్టి వామ నుడు త్రివిక్రముడై విజృంభించాడు.

సాధారణంగా రాక్షసుల దండ యాత్ర దిక్పాలకపట్టణాలతో ఆరం భమై స్వర్గవిజయంతో ముగుస్తుంది. హిరణ్యాక్షాదుల విజయయాత్ర అలాగే సాగింది. కాని బలిది ఆవిధంగా జరుగ లేదు. ఒకేసారి స్వర్గంపైనే దండె త్తాడు. ఇది గమనార్హం.

బలి తనబలాన్ని బ్రహ్మవాదులచే పొం దాడు. ఇక్కడ బ్రహ్మశబ్దం ధాతువా చ్యం. తన్మూలకమే బలం. మానవుని క యావనారంభంగనుక కామవాంఛా ప్రేరితం. అపుడతనికి 'కావలసింది యువతి. అందువల్ల బలవంతుడైన బలి రంభాదులుగలస్వర్గంతో తనదండయాత్ర నారంభించాడు.

జ్ఞానానికిప్రథమసోపానం ఉపనయనం, అందువల్లపోతనగారు వామనునిజీవితాన్ని చెప్పుతూ పుట్టగానే పురుడుపున్నెం ఏదీ చెప్పక ఉపనయనాన్ని ఎత్తుకొన్నాడు. అయితే ఈలోపలి సంస్కారాలన్నీ ఏమైనట్టు? అగ్రజన్ముల కాయా సం స్కారాలన్నీ యథోచితకాలంలో జర గాలి. లేకుంటే వాటి నన్నిటిని లాంఛ నంగా ఉపనయనసందర్భంలో మళ్ళీ జరుపుతారు. లేకుంటే ఆవటు వుపనయ నాని కర్హుడుగాడు. అందువల్ల పోత నగారిక్కడ ఉపనయనాన్ని ఎత్తుకోవ టంలో తక్కినవన్నీ చెప్పకుండానే అవి యథోచిత కాలంలో జరిగాయని తేలిపో యింది. ఇంకొకరైతే ఈసందర్భంలో జాతకర్మాదులన్నీ పట్టీవేసికొని చెప్పే వారేమో కాని పోతనగారు వాటిని చెప్ప కుండనే చెప్పాడు. అతని కథానిర్వహ ణలో యిదొక మెలకువ.

ఇక వామనుడు బలిమఖవాటికను చేరి విధం చిత్తగించండి. అప్పుడా వాటి కలో ఉన్న వారు భృగ్వాదులు, వారు వామనుని దూరంలో చూడగానే శం భుండో హరియో? పయోజభవుడో చండాంశుడో! వహ్నియో! 'అని సందే హించారు. వారు మహర్షులుగదా! వారి సందేహం వృథా యెట్లవుతుంది? వచ్చి నవాడాపైవారిలో ఒకడే, అంతేగాదు గీతామతం ప్రకారం ఆరూపాలన్నీ అత నివే. పోతనగారిక్కడ ఋషుల ద్రష్టృ త్వాన్ని ఔచిత్యవంతంగా కాపా డాడు.

వామనుడక్కడికి రాగానే బలి సుస్వా శించి తన వెంటనున్న వారికి, 'ఇత

దానవ చక్రవర్తి" అని పరిచయం చేసి, స్వస్తి జగత్త్రయీభువనశాసనకర్తకు" అని దక్షిణ హస్తాన్నెత్తి దీవించాడు. ఈ రెండుపద్యాల్లో పోతనగారు బలి జీవిత విశేషాన్నంతనూ పొగడడమేకాక భావికథా సూచనగూడా చేశాడు.

కథలో ఏదైనా సూచన చేయవలసినపుడు సాధారణంగా పాత్రల నోట ప్రస్తుతాప్రస్తుతాలు తో చేమాటలు పలికిస్తారు. పోతనగారిక్కడ అవిధంగాగాక మరొక అపూర్వ శిల్పం చూపాడు. ఈ పద్యాల్లో మొదటిదానిలో ఆరోచోట, రెండోదానిలో మూడోచోట విషబీజాక్షర ప్రయోగముంది. 'పురాస్త్రి గిరిరుద్రేషు అకచటహామాత్ర కానింద్యాః॥' అని లక్షణశాస్త్రం చెబుతుంది. అందువల్ల కృత్యాదుల్లో కృతికర్తలను గురించి చెప్పిన పద్యాల్లో అవి దొరలకుండా చూడాలని అక్షరతత్వజ్ఞులు చెబుతారు. నన్నయగారి భారతరచన ఆగిపోవటానికి ఆయన కృత్యాదిలోని 'శ్రీవాణీగిరిజాశ్చిరాయ'లో ఏడోచోట చకారం నిలువటమే కారణమని వారిమతం. సాధారణంగా కవులు తమశత్రువులపై నిటువంటి గీర్వాణ ప్రయోగం చేస్తుంటారు.

పోతనగారిక్కడ వామనునితో 'ఇతడే దానవచక్రవర్తి' అని చెప్పించిన పద్యంలో ఏడోచోట చకారం నిలిపి మహాభారత రచనవలె అతని కార్యానికి జరిగే విఘ్నాన్ని; తరువాత 'స్వస్తిజగత్రయీభువనశాసనకర్తకు' అనే పద్యంలో మూడోచోట జకారాన్ని నిలిపి అతనికి కలిగే కీడును సూచించాడు. 'హాజగడలిడి మూడవచో నిజముగ నిందించి చెప్ప నీల్గుట యరుదే!' అని కవిజనాశ్రయుని వాక్యం. అయితే బలిచక్రవర్తికి మరణంలేదు కాబట్టి పోతనగారీపద్యంలో నిందార్థం రాకుండా జాగ్రత వహించాడనుకోవాలి. అంతేకాక నన్నయగారి స్తుతిలో ఆరోచోట చకారం నిలిచినందుకు భారతరచన అతనితో ఆగి అనంతరీయులతో పూర్తయింది. అలాగే యిక్కడగూడ దానవచక్రవర్తి పద్యంలో ఆరోచోట చకారం నిలిపినందుకు ఆయజ్ఞం అతనితో ఆగి అనంతరం భృగ్వాదులతో పూర్తి అయ్యే సూచన కూడ వచ్చింది. ఇది ఆయన యిక్కడ చూపిన అపూర్వ శిల్పమర్మాల్లో ఒకటి.

కావ్యానికి జీవం ధ్వని. దాన్ని శబ్దం నుండి పిదకటానికి పోతనగారి కబ్బిన నైపుణ్యం అనంతరానువాదకర్తల కెవ్వరికీ అబ్బలేదు. ఈఘట్టంలోని బలివామనుల సంభాషణంతా సరసమైన ధ్వనికావ్యాని కుదాహరణం. బలి యొక్క అమాయిక ప్రశ్నలు, వామనునియొక్క గడుసు సమాధానాలలో ఉత్థితమైన చమత్కారం పాఠకులను కావ్యానంద డోలల్లో ఊపి విడుస్తుంది. బలి వామనుని చూడగానే లోకసామాన్యరీతి ననుసరించి,

వడుగా యెవ్వరివాడ వెవ్వడవు సం
వాంస్థలం బెయ్య, ది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమ
య్యెన్ వంశమున్ జన్మమున్
కడు ధన్యాత్ముడనైతి! నీమఖము యో
గ్యంబయ్యె! నాకోరికల్
కడతేరెన్! సుహుతంబులయ్యె శిఖులున్!
కల్యాణ మిక్కాలమున్.

అని అన్నాడు. ఈపద్యంలోని బలి మాటల్ని ఓపర్యాయం పరిశీలించండి. ‘నీవు వచ్చుటవల్ల నావంశం జన్మం సఫలమయ్యాయి. నేను ధన్యాత్ముడనైనాను. శిఖులు సుహుతములై ఈయజ్ఞం యోగ్యమైనదయింది. ఇది కల్యాణకాలం. నాకోరికలు కడతేరినవి, అని అతడు పలికిన ఒక్కొక్క మాటకూడ వచ్చినవాడు విష్ణువనేవిషయం మనకు తెలుపుతుంది. అంతేగాక 'నాకోరికలు కడతేరినవి' అనటంలో 'కడతేరటం' భావివిఘ్నాన్ని 'ఇదికల్యాణకాలం' అనటంలో కల్యాణం అతనికి ముందుకలుగబోయె రసాతలవాసశుభాన్ని సూచిస్తాయి. ఇక దీనికి వామనుడు చెప్పినసమాధానం మరీ చిత్రం.

ఇది నాకు నెలవని యేరీతి బల్కుదు
ఒకచోటనక యెందు నుండ నేర్తు
ఎవ్వరివాడనం చేమని పలుకుదు
నాయంతవాడనై నడువ నేర్తు
నీనడవడి యని యెట్లు వక్కాణింతు
పూనిముప్పోకల బోవనేర్తు
అది నేర్తు నిది నేర్తు ననియేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు
నొరులు గారు నాకు నొరులకు నే నాదు
ఒంటిగాడ చుట్ట మొకడు లేడు,
సిరియు తొల్లి గలదు చెప్పెద నాయింకి
సుజనులందు తఱచు సొచ్చియుందు.

అని చెప్పాడు. దీనిలో తాను విష్ణువు, స్వయంభువు, త్రిమూర్త్యాత్మకుడు అని చక్కగా ధ్వనింపచేశాడు.

ఈనాటివారు పోతన శ్రీనాథుల చుట్టరికాన్ని అంగీకరించలేదు. అతని అవసానదశలో పోతన ఉండవచ్చునన్నారు. అది నిజమైతే అతడు శ్రీనాథుని అవసానదశలోని కడగండ్లు కండ్ల చూచాడేమో! ఈపద్యంలో ఆ శ్రీనాథుడుగూడా కనిపిస్తాడు చూడండి. ఇతడు కవిసార్వభౌముడు గనుక ఒకచోటనక ఉండనేర్చినవాడు. తాను ముప్పోకలు అంటే కవిత్రయంపోక పోవనేర్చినవాడు. ఇతనికొక్కడాపాపం! నావారనేవా రెవరూ లేరు. ఉంటే అవసానదశలో కష్టాలుండవుగదా! ఒరులు తనకు లేరు, తానే ఒకరికైనాడు. సిరికూడా పూర్వం ఉండేది కాని అపుడు లేదు. అతని స్థానం కేవలం సుజనులు అంటే పండితుల్లో మాత్రమే మిగిలింది. ప్రభువుల దగ్గర మిగలలేదు. ఈవిధంగా ఈ పద్యంలో అతని అంత్యదశ మ కండ్లకు కడుతుంది. వామనుడు బలితో

ఒంటివాడ నాకునొకు నొకటి రెండడుగుల
మేర యిమ్ము సొమ్ము మేర యొల్ల
కోర్కెదీర బ్రహ్మకూకటి ముట్టెద-

అని చెప్పి మూడడుగుల భూదానం పొందాడు. తరువాత అతని మూర్తి విక్రమించసాగింది. అది నభోవీథిలో తోయదమండలం, ప్రభారాశి, చంద్రలోకం ధ్రువపదం, దాటిపోతుంది. దాన్ని ఎఱ్ఱనగారు,

ఇనుని తనమౌళి రత్నంబు నిద్ధహార
తరళ రత్నంబు కటి సూత్రపరిధిమధ్య
రత్నమును నూపురాగ్ర విరాజమాన
రత్నమును జేయుచును ప్రవర్ధనముఁబొందె

అని చెప్పాడు. ఎఱ్ఱన అంటే అరుణుడు కాబట్టి అతడా అంబరమణిని మణిధర్మం చెడకుండా సానబట్టి మౌళిరత్నం, తరళరత్నం, కటిసూత్రరత్నం, నూపురరత్నం చేశాడు. ఇక పోతనగారా విధంగా కాదు. ఎఱ్ఱనగారు మణికారుడైతే పోతనగారు స్వర్ణకారుడు. అతడా రత్నాన్ని తీసుకొని, 'రవిబింబం బుపమింప' అని ఆరంభించి, ఛత్రంలో శ్రవణాలంకారంలో, గళాభరణంలో, కేయూరంలో, కంకణంలో, కటిఘంటికలో, నూపురంలో, పాదపీఠంలో పొదిగాడు. అతడా విశ్వరూపుని, ఇంత, ఇంతింత, అంత, అల్లంత అనే సామాన్య విశేషణాలతో నిచ్చెనగట్టి పాఠకుని దృష్టిని దీనిపైనుండి సత్యలోకం వరకెక్కించి చూపించాడు. కాని యేదీర్ఘ సమాసాలూ వాడి అతనికండ్లు బైర్లు కమ్మించలేదు. పోతనగారివలె తెలుగులోని సార్థకశక్తిని ఇంత బాగా యెరిగినవా రెందరు?

వామనుడు పెరిగి మొదటి పాదంతో ఆకాశాన్ని, రెండో పాదంతో భూమిని అంతనూ కొలిచాడు. అతనికిక మూడో పాదానికి చోటు మిగులలేదు. అది చూచి బలి మూడో పాదం తన తలపై మోపమన్నాడు. దానితో వామనుడు రెండో పాదంతో కొలుచుకున్న భూమినే మొదటి అడుగులో మళ్ళీ కొలుచుకోవలసి వచ్చింది. అపుడంతకు తప్ప గత్యంతరం మిగలలేదు.

వామనుడు జ్ఞానానికి ప్రతీక. జ్ఞానం త్రయీమయం. ఆ త్రయి వేదాలు. వానిలో మొదటిది ఋగ్వేదం. అదిదేవతాస్తుతిమయం కాబట్టి దివిని, రెండోది యజుర్వేదం, అది యజ్ఞమయం కాబట్టి భూమిని అంతనూ కొలిచాయి. మూడోదైన సామవేదానికింక స్థానం మిగులలేదు. అంగువల్ల అది యజ్ఞాంతంలో భూమిపైని ఋగ్వేదం కొలిచిన దేవతలనే మళ్ళీ కొలుస్తుంది. ఇది జ్ఞానరూపుడైన వామనుని మూడడుగుల తత్త్వం. ఈలాటివిశేషాలింకా ఈ కథలో చాలా ఉన్నాయి కాబట్టి ఇంకొక్క విశేషంతో దీన్ని ముగిస్తాను.

వైష్ణవతత్త్వంలో సాధారణంగా లక్ష్మి లేక విష్ణువు లేడు. అందువల్ల అతడెక్కడికి వెళ్ళినా ఆమె ఉండవలసిందే. గజేంద్రుని రక్షించేసమయంలో ఆమె అవసరం లేకున్నా మైమరపున ఆమెను లాక్కువెళ్ళిన మహానుభావు డాస్వామి కాని యిప్పుడా అవకాశం అతనికి కలుగలేదు. అయితేమాత్ర మేం? పోతనగా రూరకుంటారా!

ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై
   అంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై కపోలతటిపై
   పాలిండ్లపై నూత్నమ
ర్యాదన్ చెందుకరంబు క్రిందగుట మీ
   దై నాకరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే
   కాయంబు నాపాయమే?

అని గురువుగారితో చెప్పే బలిచక్రవర్తి మాటల్లో ఆయన లక్ష్మీదేవికి జాగ్రతగా ప్రవేశం కలిగించాడు. కొందరీ పద్యంలో కొప్పుపై. తనువుపై పాదాలపై, కపోలాలపై, అన్నపుడు ప్రక్రమభంగ మందన్నారు. కాని అది సరిగాదు. ఆచేయి శ్రీసతి పాలయలుక వహించినపుడు ఆమె నూరార్చటానికి ప్రణయశాస్త్రాన్ననుసరించి మొదట కచాకర్షణం, తర్వాత బాహ్వాకర్షణం, ఆ మీద చేలాంచలాకర్షణం చేసింది' అప్పటికీ ఆయమ్మ అలుక తీరకపోగా పాదప్రణిపాతం చేసింది. దాసరి తప్పులు దండంతో సరి కాబట్టి. అంతటితో ఆ ఘట్టం సమాప్తి. తదనంతరం కపోలస్పర్శ, పాలిండ్లపై నూత్నమర్యాద. ఈవిధంగా ఇందులో మొదట మానవిప్రలంభం, అనంతరం దీనితో పరిపుష్టమైన శృంగారం ఉన్నాయి.

బలిచక్రవర్తి శుక్రాచార్యునికి తన నిర్ణయం చెప్పి భూమిని ధారవోసేటందుకు విష్ణుని పాదం కడిగాడు. అది అపుడతనికి 'కలితానమ్రమరాలలాటపదవీ కస్తూరి కేశారమై' పూర్వఘట్టానికి బహులు తీర్చుకున్నట్లు కనిపించింది. ఈ విధంగా పోతనగారిందులో లక్ష్మీప్రసక్తి కలిగించి శృంగగ్రాహికగానే ఇంతటి శృంగారాన్ని ప్రదర్శించాడు. ఈ విధంగా పోతనగారు భక్తికి శృంగారాన్ని అంగంగా చేయుటం ఆ రెండిటికీ గల సామీప్య సంబంధం ఓ కారణం కావచ్చు. ఆ కారణంగా ఆయన సిరి దప్పిన వెన్నుని మొగాన్ని మనకెక్కడా చూపించడు.

భాగవతంలోని ఈ వామన చరిత్ర మానవునిలోని దైవాసుర సంపద్విభాగయోగానికి వ్యాఖ్యాప్రాయం. అంతేకాక దీనిలో బహ్వృచగీత, ఆత్మవృత్తస్వరూప వివరణం, శుక్రనీతి, ఉన్నాయి. కాబట్టి పురాణకథల్లో దీనికో విశిష్టత ఉంది. అందువల్లనే ఆదర్శగృహస్థుడైన ప్రవరుడు ప్రతిదినం 'వామనస్తుతి' పరత్వంతో తీచేవాడు. ఎప్పటికైనా మానవజీవితానికీ వామనావిర్భావంతోనే ముక్తి కాబట్టి పోతనగారీకథను ఆద్యంతం తత్త్వగర్భితంగా నిర్వహించాడు. దీనిలో ఆయనకవితా శిల్పం

# కవితాసాధన తపస్సాధనవంటిది

**తరంతరం (పరిశీలన) వెల్లడించిన రహస్యం *** — శ్రీ సోమసుందర్.

( గతసంచిక తరువాయి )

పేర్వారం జగన్నాథంగారి తమసోమా జ్యోతిర్గమయ-ఆరిపోయే దీపం పడే దీనావస్థను దర్శించింది. దీపం వెలుగుతున్నంతకాలం చీకట్లు వినయాన్నే నటిస్తాయి. కనకనే దీపం ఆరకముందే మరో దీపం వెలుగుతూ నిత్యదీపావళి జరపాలని ఆశిస్తాడు. ఈకవి భావాభివ్యక్తిలో భాషాభేషజం రానీయడు. అలాగని పొదుపరితనమూ కోల్పోడు. కవితను పరస్థలా లెరిగి చెక్కని నిద్దపు బొమ్మగా మలుస్తాడు. పట్టాలు తప్పిన బండి అనేమరో కవితలో అస్తవ్యస్త సమాజ స్వరూపం సమగ్రంగానూ చక్కగానూ వర్ణితమైంది... పొట్లపల్లి రామారావు మెరుపులు ఒక అణుకవిత. భూమినుంచి త్రవ్వితీసిన బంగారాన్ని కాపాడడానికి దాని గర్భంనుంచే త్రవ్వితీసిన ఇనుముతో కటకటాలు నిర్మించి దానిలో ఖైదీ అయ్యాడు మనిషి. అనేది చక్కని భావమే! కాని దానినే ఇంతకన్నా సంగ్రహంగా వ్యక్తంచేయవచ్చు. ఆ ప్రయత్నం కనిపించదు. భావాన్ని పల్చగా వచనంపై పరచి-వచన కవితగా మారిందనుకోవడం ప్రమాదం! కవితా స్వరూపస్వభావాలలో లఘువు బిగువు లెంతో అవసరం! నాలుగు వచన పాదాలలో చెప్పగలిగే భావాన్ని ఒకటిరెండు పాదాలలో చెప్పడం సాధ్యమేమో కవులు ఆలోచించడం మంచిది. ఆ శిల్పదృష్టి లేకపోతే కవితకూ వచనానికీ తేడాయే కనిపించదు. వచనాన్ని నడుములువిరచి పొరలుగా పేరిస్తే కవిత్వమైపోతుం దనుకునే ప్రమాదం యిప్పటికే మితిమీరి పోయింది. ఈ ప్రమాదానికి కవులే కారణం. ఇతరులను నిందించి లాభంలేదు. పోతుకూచి సాంబశివరావు-తెలుగు తెలుగుతనం అనే కవిత ఇలాంటిదే!

బద్దూరి నరసింహ అనే క్రొత్తకవి కూడా తెలంగాణా గ్రామ్యంలోనే రచన చేశాడు, నికృష్ట జీవరాశుల గుణగణాలన్నీ మనిషిని పట్టి వదలలే దని యితని తాత్పర్యం. బాలగంగాధర తిలక్ ప్రఖ్యాత కవిత గొంగళీపురుగు మధ్యతరగతి జీవితాల కాలీన్ని, బోలాతనాన్నీ హృద్యంగా వర్ణించిన కవిత. అల్పసంతుష్టులూ, అధికవ్యామోహాలూ కలవరపెట్టే కోటీశ్వర వీరేశ్వర రావుల మహాభారత చరిత్ర సంగ్రహంగా రెండు పుటల్లో అందించిన కవిత. అల్పోపలతుల గొంగళీ పురుగుల స్వగతాలను వక్రోక్తి రశ్మిలో ప్రదర్శిస్తాడు బెల్లంకొండ రామదాసుని నిష్క్రమణం. ఒకానొక విషాద వాతావరణాన్ని మన చుట్టూ సాలెగూడులా అల్లుతుంది. ఈకవితలో మరీ అతని స్వగతం వాచ్యంగా వినిపించి అతని మరణానంతరం మరింత దుఃఖం పొటమరింప చేస్తోంది. బైరాగి ప్రఖ్యాత కవిత- నాకొంచెం నమ్మక మివ్వు!' ఆత్మ విశ్వాసం అనే సెల్ఫ్‌స్టార్టరు చెడిన ఆటోమొబెల్ జీవితాలకు వెనకతోపు కలిగిస్తుంది, నమ్మకం లేని హృదయం-పుల్లలు లేని అగ్గిపెట్టె! అంటే స్థూల దృష్టికి నిండుగా కనిపించినా ఉత్త శూన్యమే. గిరాటు వేయడానికి తప్ప ఎందుకూ కొరగానిది! అట్టిదానికి నమ్మకమనే అగ్గిపుల్లను నింపితే ఏపనైనా చేయగలుగుతుంది. ఈ కవిత సామాన్య మానవ గళోద్ఘోషాన్ని వినిపిస్తుంది. వరుసగా పైముగ్గురూ ప్రస్తుతం కీర్తిశేషులై, కవితాశేష కాంతులను విరజిమ్ముతున్న తారాపథవాసులు!

భైరవయ్య ఎముకల కేకలు - 'మనిషి, మానవతా నిగమాగమ ఋషి! ఈ విరాణ్మాయామయ ప్రపంచలో ఆదినిని పొలికేక పెట్టాడు! అలాంటి మనిషిని నింగి మధ్య మార్తాండునిలా బ్రతక మని సందేశిస్తుం దీకవిత. బోయి భీమన్న గుడిసెలు కాలిపోతున్నాయి కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందిన సామాన్యకవిత! కులమతాలకు ఉమ్మడి కాష్ఠం అనేకవిత కూలిపోతున్న విమాన వర్ణనంతో పరాకాష్ఠకు పర్యవసిస్తుంది. అభివ్యక్తి రామణీయకత నందుకుంటుంది. మల్లిక్ చతుష్పంచకం అనే వ్యంగ్య కవితలో - ఇరవయ్యేళ్ళ స్వాతంత్ర్య భూజం ఎలాపెరుగుతోందో, జాతీయ వాదులమనుకొనే కాషాయరంగు కాటీలు ధరించిన వ్యాఘ్రాలు దాన్నెం చేయాలని పథకాలువేస్తున్నాయో ధ్వనిమయం చేసిన చక్కని కవిత. మహాస్వప్న మూరిగిన సూర్యుణ్ణి నంజుకుంటూ మృత్యువును కాస్త కాస్తగా కొరుక్కు తింటున్నాను- అనే శీర్షికగలది దిగంబర కుష్ఠు వ్యవస్థా సంకలితం! అలాతినితిని అతగాడేమైపోయాడో పాపం మళ్ళీ పికరు లేదు! రెండోసారి పిచ్చెత్తినపుడు ఏమేమి రాశాడో లేక కూశాడో కవి చెప్పుకున్న సంజాయిషీ పత్ర మిది. అప్పుడు చూసిన చేసిన లక్షపిచ్చిపనుల్లో 'సినిమాచూశాక థియేటరో తెర కడం

---

( 18 వ పేజీ తరువాయి )

గూఢ కథావ్యంజకమై రాణించింది. ఈకథలో కందాలు సీసాలు. ఎక్కువ. వామనుడు పుట్టుకతో కందువ. ఆక్రమణంలో బ్రహ్మకూకటి ముట్టాడు. కాబట్టి యిందులో ప్రథమస్థానమాక్రమించిన కందా అతని పుట్టుకను ద్వితీయ స్థానమాక్రమించిన సీసాలు శీర్షకశబ్దభవాలు కాబట్టి అతడు బ్రహ్మకూకటి ముట్టడాన్ని వ్యంజిసాయి.

గా నిలబడ్డాం' ఒకటి! పాపం మంచి సత్తాగల కవులు ఇలాంటి వ్యష్టివాదాలతో ఎలా వేస్టయి పోయారా అన్న బాధ మిగులుతూ ఉంటుంది. సంయమమూ, ఆత్మశోధనమూ లేకపోతే ఎలాంటి పిచ్చెక్కి పోతారో అనే విషయములో భావితరాలకు 'దిగంబర శకం' ఒక ప్రబల హెచ్చరిక !

విచక్షణతారహితంగా దిగంబరుల కవితలనూ ముఖ్యంగా ఈ మహాస్వప్న కవితల్నీ ప్రచురించిన ఈ తరంతరం సంకలనం - సర్వాలనూ ఒకే ఔదార్యంతో ఆలింగనం చేసుకో గలిగే స్వైరిణీ చిత్తజాడ్యాన్ని అలవర్చుకున్నదా అనిపిస్తోంది. మాలిక చోదక శక్తిగా ఒక తాత్త్వికతను నిలుపుకోలేని తత్త్వాన్ని యింతకన్న ఏమనాలి? సంకలన కర్తలు తమ ప్రజాతంత్ర బుద్ధికి ఇలాంటి విధానాన్ని తార్కాణంగా నిలుపుకుంటే మాత్రం ఆశాభంగమే అనక తప్పదు. కారణం దిగంబరు లందరినీ తన్నినవారు, వాళ్ళని తలకెక్కించు కుందుకు ప్రయత్నించడంలో అర్థం ఏమిటి?

శ్రీ మాదిరాజు రంగారావు మౌనంగా కవితా తపస్సమాధిలో జీవిక సాగించే భావుకుడు. సభలూ, సమావేశాలూ, కీర్తిగానాలూ, రేడియో బాజా బజంత్రీలు వంటి వేవీ ఆయన దరిదాపులకు చేరవు. ఏ పబ్లిసిటీ గ్లామర్లూ రూమర్లూ అందనంత దూరంగా ఉంటాడాయన. కవి చేయవలసిన పని కవిత్వం రాయడమే అన్నంత దీక్షాబద్ధబుద్ధితో కాలక్షేపం చేసే వారు ఎవరూ కనిపించని ఈ యుగంలో మాదిరాజు రంగారావు ఒకరే స్పెసిమన్! ఆయన ఎన్నో గొప్ప కవితా సంపుటాలు ప్రచురించాడు. ఉదాత్త భావనాపరుడు. కాని ఈ కవి డిక్షన్‌లో శ్రుతిపేయతకీ, మాధుర్య గుణానికి అవకాశ మీయడు. పైగా కవిత్వం హృదయ ద్రవ్యం నుంచి పైకెగసి మేధాపరికరంగా పరిణతి పొందుతుంది. దీనివల్ల సాధారణ పాఠకునికి గజిబిజి ఏర్పడుతుంది. హృదయ ద్రావకశక్తి కన్న ధీశక్తికి అవసరం ఎక్కువ అపేక్షింపబడుతుంది. దీనివల్ల కనీసం సంగీతంతోనైనా భౌతిక పరితృప్తి లభించని సాధారణ పాఠకుడు పెడ మొగం పెడతాడు. ఐతే ఆధునిక యుగంలో ప్రతి మంచి కవితకు రెండు మూడు స్థాయి-లుంటాయి. రెండు మూడు రసజ్ఞ శ్రేణులకు అందుబాటవుతూ రమింపచేస్తూ ఉంటాయి. పైగా నేటి పాఠకుల సాంస్కృతిక స్థాయి గాని, కవితా రసజ్ఞత గాని, (Poetic sensibility) ఒకే సమాంతరంలో లేవు అలాగే మన కవులలోనూ ఎన్నో స్థాయీభేదా లుండటమూ సహజమే. అందరూ ఒక్కలాగే రాయాలని ఏ ఒక్కరు కోరినా అట్టివారి కోరిక Regimentation కు పర్యాయపదమే అవుతుంది. కవులలో వైవిధ్యమూ బహుముఖీనతా తప్పక ఉండవలసినవే కాక, అనివార్యమైనవీకూడ! నిజానికి మంచి కవిత్వశ్రోత మంచికవే అనే స్ఫురణ నిజాయితీగా కలిగిననాడు కవిత్వద్రవ్యాత్మక స్థితిని చూసి గర్వపడవలసిన అవసరం ఏర్పడదు. గుణాత్మక సంపదే కవితకు గర్వకారణమూ, భూషణమూ కాగలుగుతుంది. ఆ శుభఘటికలు తెలుగు కవితకు ఆసన్నం కావలసే ఉన్నవి అప్పుడే మంది మార్బలంతో కవులుగా చెలామణీ అయే చాలమంది అల్ప ప్రతిభులు-రంగులు వెలిసిపోయిన మట్టిబొమ్మలుగా నిలవవలసి వస్తుంది. కవిత్వేతర పదార్థాన్ని కవిత్వంగా చెలామణీ చేస్తున్న వారిని వర్తమానం సహించవచ్చు, ఓరిమీ, తాలిమీ, ప్రదర్శించనూ వచ్చు. కాని భవిష్యత్తు కా పూచీ లేదు. ఎందరో కవిమ్మన్యులను ఎన్ని బోట్లు పెట్టి నిలబెట్టినా కాలం కర్కశంగా ఉత్తర క్రియలు జరిపే తీరింది.

కనక ప్రస్తుతం కనిపించే మెరుపులన్నీ వజ్రాఘాతాలే అనుకొని భయపడనవసరం లేదు. మాదిరాజు రంగారావు కవితారీతిని గురించి ఆలోచిస్తుంటే ఎన్ని భావాలయినా ఊట లూరుతాయి. ఈ కవి సంపూర్ణ కావ్యాలే కాక ముక్తకాలు చదివినా కవితా శక్తి గోచరమవుతుంది. ఐతే ఈతని కవిత్వంలోని ప్రధాన లోపం వైవిధ్యరాహిత్యం. రీతిలో శైలిలో అభివ్యక్తి సంవిధానాలలో ఎప్పటి కప్పుడు నవ్యతీరాలకోసం అన్వేషణ కానరాక మొనోటనీ కలుగుతుంది. 'మహాకాల కాసారంలో వికసించిన కనక శతపత్రం సూర్యుడు' అనగలగడం గొప్ప కవితా స్ఫురణ. భావన పిచ్చలించడానికి సాధన ఎంత అవసరమో తెల్లమవుతుంది. వికార ప్రదర్శకులకు తన్న సూర్యుడు మురిగిన పండులా కనిపించడు. సూర్యుణ్ణి సూఱుబంగరు రేకులకమలమన్న ఈ కవి వెంటనే దాన్ని పూర్వపక్షం చేస్తాడు. 'అంధకార వలయంలో అగ్ని కాష్ఠాలుగా సంభ్రమించే హృదయాగ్ని గోళం' - అంటాడు. సూర్యుడు జ్ఞానానికీ అనుభూతికీ సమగ్ర సంకేతం. కాంతికీ ఉష్ణానికీ సర్వంకష ప్రతీక. కాంతి కవిత్వమైతే ఉష్ణం తత్త్వశాస్త్రం వంటిది. సూర్యుడే మేధావుల హృదయాగ్నిగోళమన్న స్ఫూర్తి కవికి కలగడం సహజం! ఈ కవి ప్రతిపాదమూ సుదీర్ఘ వ్యాఖ్యాపేక్షం! అందుకే మరోసారి చదివించగలుగుతుంది. ఉత్తమకవితా శ్రేణిలో సముజ్జ్వలంగా నిలుస్తుంది. కాలాన్ని గురించి సకల భావజాలాన్నీ సంపుటీకరించే యీ కవిత, సాలోచనముగా చదివితే కవి శక్తి అవగతమవుతుంది.

మిరియాల రామకృష్ణ రచించిన - వెన్నెల రమ్మంది కూడ ఉత్తమశ్రేణికి చెందిందే. వీరి శైలిలో ప్రసాదగుణం పాలు హెచ్చు. అంతమాత్రంతో ప్రాణప్రదమైన అర్థగాంభీర్యం వ్యంగ్యం కాదు.

క్రొత్త కలాటు కలగదు. గుంఫన, ప్తత కొంత అవసర మవుతుంది. దానిని వి నిర్గుణానుభూతులను సగుణపదచిత్రా మర్చడం ద్వారా సాధిస్తాడు. గుబురు సాల కసాయిచీకటివంటి పదచిత్రాల ద్వారా జగన్నాటకంలో విలన్ పాత్ర న్నింటినీ ప్రత్యక్షం చేస్తాడు. 'కైలాస సంత ఫాలతలంనిండా కన్నులు' ప్రసస్తే కవికి ఎలాంటి దర్శనమైనా కలుగుతుందని విశ్వసిస్తాడు. నగర జీవన జంజా ఎంలో నిశబ్ద కోలాహలాన్ని ప్రదర్శించిన కవి ముకురాల రామారెడ్డి. తెలంగాణా మాండలిక పదజాలాన్ని అవసరార్థం చక్కగా ప్రయుక్తం చేస్తాడు. ఈద్వారా సామాన్యుని గుండెమోత్రి పట్టియిస్తాడు. ఐతే ఆ పదాల కొకటీక యివ్వాల్సిన అవసరం ఏర్పడుతుంది. ఒకరి మెడలపై మరొకరి తొడలు' అనే పదచిత్రం తగిలేసరికి ఒళ్ళు ఝల్లుమంటుంది. 'పంచమంది కవుల అభ్యుదయ కవితాసంకలనం'గా పతాకశీర్షిక ధరించిన సంకలన కర్తలు అతిమితివాద నియంతృత్వధోరణికి చెందిన రచయిత ముదిగొండ శివప్రసాద్‌నీ అతి అతివాద రచయితల్నీ ఏకపంక్తిని ఆసీనుల్ని చేయగలగడం ఎలాసాధ్యమో తెలియదు!

ఈ అంశంలోనే వీరి తాత్త్విక జ్ఞాన దారిద్ర్యం తేటతెల్ల మవుతుంది. కాని శివప్రసాద్ కవిత 'అవర్ణనీయ' హృద్యంగానే వుంది. 'మూగవోయిన కంఠంతో అమర గాయకుడు కొట్టుకుంటున్నట్టు'- అనే భావచిత్రం చదివేసరికి నాకొక్కసారిగా మహాపండిత ఓంకారనాథ్ ఠాకూర్, నజ్రుల్ ఇస్లామ్, దేవులపల్లి కృష్ణశాస్త్రి, గార్ల స్మృతివీథిలో మెరుస్తారు. వీరంతరూ గొంతుమూగవోయి అత్యంత దయనీయస్థితి అనుభవించిన వారే!

సమాన భావస్ఫూర్తి కలిగించే అసంఖ్యాకరూపకాలను గుదిగుచ్చడం ఆధునిక కవితకు భూషణంగా మారింది. దానివల్ల వేసిన బొమ్మనల్లా చెరిపేసుకుంటూ ముందుకుపోయే గుహ్యాత ఏర్పడుతోంది. ఒక గొప్ప రూపకమో, ఒక ఉత్ప్రేక్షో ఒక గొప్ప పదచిత్రమో నిజానికి సరిపోతుంది - ఒక సన్నివేశాన్ని అద్భుతంగా మెరిపించడానికి. ఆ అంశాన్ని ఆధునిక పాశ్చాత్య కవులెందరో సాధించి చూపారు. సమానార్థక భావచిత్రాలను వెదజల్లడం - Impressionistic Technique' నుంచి వచ్చిన సంప్రదాయంగా స్థిరపడింది. మునిసుందరం కవితలో ఒకమాటతో ఒకఅద్భుతచిత్రాన్ని సాధించారు. 'రాత్రి వచ్చింది; ఆటంబాంబు చెరచిన నగరంలా!' చెరచిన ఒక గడసరి ప్రయోగం. ఈరాత్రి సకిలించింది కవితలో సంయమనం కొంత కొరవడింది.

మళ్ళీ వీరిదే రెండో కవిత 'దారి' మరికొంత బిగువుగా ఉంది. ఒక కవి ఒక రూపకం వేసినపుడు అది పాఠకుని అనుభవ పరిధిలో తటాలున మెరవాలి. శంకాకలితం కాకూడదు. 'సహనాన్ని సహపంక్తిలో అందరికీ పంచాలని ఒక కవి అంటే - సహనం పంచబడేదేనా, వ్యక్తిగత సంస్కారజన్యమా? అనే సంశయం కలగకూడదు. శంక రక్తిని విరుస్తుంది. వేర్పాటుధోరణిని నిరసిస్తూ కవి - నువ్వు పువ్వువైతే - నేను పరాగాన్ని అనడం బాగుంది. కాని - 'రెక్కవైతే - నేను రెక్కను' అనడం పదాల ఖేలతప్ప సమన్వయం దొరకదు. ఇవే కవిత కెదురయ్యే ప్రమాదాలు.

'వర్తమానం నీపోరాట భూమి ... భవిష్యత్తునీ ఆకాశజ్యోతి' అన్నవారు యలమంచిలి తాయారు. 'దారిద్ర్యపు కనుమలలో నినదిస్తున్న రుద్రవీణా నా దాన్ని అంతఃపురాలవైపు మళ్ళిస్తున్నా' నన్నవారు రాజు (?!) రాజేంద్ర ఆరేసిన చీరా వారసులు అనే చిన్న కవితలలో వర్తమాన దుస్థితి హృద్యంగావర్ణితమైంది. ఏహ్యానికి త్యాగమనీ అసమర్థతకి సహన మనీ అబద్ధాల ఉత్ప్రేక్షలతో సంతృప్తిపడే మూగ జీవుల చిత్రణ రావెళ్ళ వెంకటరామారావు అనలగీతంలోనిది. రంధి సోమరాజు తన సహజతా ధురీణమైన తూరుపుఅప్పలమ్మల భాషలో 'వోనాకాలాన్ని' వర్ణించారు. భాషను భేదించి లోనికి పోగలిగిన వారికి హృద్యమైన జీవనచిత్రాలందకపోవు. కవితలో ఎక్కడైనా ఒకటి రెండు సంస్కృత సమాసాలు గోచరమైతే చాలు గోలంగోలుగా బొబ్బరించే కొందరాధునికులీ భాషను మెచ్చుకోగలగడంలో చమత్కారం లేకపోలేదు.

రెంటాల నగరంలోరాత్రి ఇదివరకే ప్రఖ్యాత మైనది. 'నెత్తిపై నింగి మృత్యువు ముచ్చట ముడిలా వేల్లాడుతోంది' అనీ వేశ్య వాలుజడ నగరవీథి అనీ చక్కని రూపకాలను కల్పిస్తాడు. వరద రాజేశ్వరరావు కవిత - ప్రశ్న ప్రశ్నలాగే ఉంటుంది. లోవ్యక్తిని చంపి సమాజ సమూహాల్ని ఆరాధించడం గురించిన ఆక్రోశం - వినబడుతూ, సమస్త చరిత్రా ఒక మహాప్రయోగమని భావిస్తూ మిగిలిపోయిన ప్రశ్నలనుగురించి విచికిత్స చేస్తూ ముగుస్తుంది. ప్రజాతంత్రయుగంలో వ్యక్తివాదుల ఆక్రోశం తీరేదికాదు.

మట్టి ప్రమిదలో మణిదీపం వెలిగించిన మహాత్ముడికీ మట్టి దీపాలను మట్టిలోకే నెట్టిన దురాత్ముడికీ ఉన్నవారను ప్రదర్శిస్తుంది విద్వాన్ విశ్వం కవిత. మట్టిలో... వి. మధుసూదనరావు ఏకారణంవల్ల ఇందులోని కెక్కిందో కాని - పేలవమైన కవిత! ... వేగుంట మోహన్ ప్రసాద్ సెల్ఫ్‌పిటీ విచిత్రమైన భావనలో ఆత్మగ్లానిని ఆవిష్కరిస్తుంది. "కార్తీకమాసంలో మీరు సముద్రస్నానాలకొస్తే నాకోసం ఆకాశం అంచుకి ఒక్క అలని పంపించండి!' అనే చక్కని ఇమేజిస్టు ధోరణిలో విగతజీవుని ఆత్మ

కోసుతుంది. మేరునగం మీద నిద్రించే ఒంటరి స్వప్నం, నీట మునిగినవతుత్రాలు వంటి ఎన్నో పదచిత్రాలు కవితనిండా పరచుకొని ఉంటాయి. షోవ చూపుతాయి. కీర్తిశేషుడు వే. నరసింహారెడ్డి తన అసంపూర్ణస్వప్నాన్ని తానే చెరిపేసుకుని వెళ్ళిపోయిన సహృదయ భావుకుడు. పాపం అతను బ్రతికినంతకాలం_ఇతరులెవరైనా తని యింటిపేరు తప్పుగా రాస్తారనే ఎప్పుడూ వే అని మాత్రం రాసుకొనేవాడు. అతనలా వెళ్ళడం చూసి, ఈసంకలనకారులు అతని యింటిపేరు వేణుముగ్ధల అనేదాన్ని మార్చి వేమిరెడ్డిగా అచ్చువేశాయి.

అచ్చువో తమవో యిలాంటి పొరపాట్లను ఎవరైనా క్షమించవచ్చు. కాని పదికాలాలపాటు మన వలసినదీ, మన కాలాన్ని - ఆగామిలోకానికి అందించవలసిందీ కవితాసంకలనం. దానికి సముచిత అర్హత ఉత్తమ రసజ్ఞత! అదే లోపించి, ఫలితార్థం వేరొకటిగా కేంద్రీకరించుకోవడం స్తుతిపాత్రం కాదు. అందుకే వెనక ఈ సంకలనం గురించి భారతిలో (1977 జనవరి) ఈ కవితా సంకలనాన్ని ఈ వ్యాసకర్త సమీక్షిస్తూ 'ఒక టన్ను ముడిఖనిజంలో ఐదుగ్రాముల బంగారం!' అనే శీర్షిక ఉంచవలసి వచ్చింది. ఆనాటి నిర్ణయాన్ని మూడేళ్ళు గడచిన తరువాత కావించిన పునఃపరిశీలనలో సైతం మార్చుకోవలసిన అవసరం ఈ వ్యాసకర్తకు కలగకపోవడమే ఆశ్చర్యకరం! ఈ తరంతరం ద్వారా ఈయుగపు కవితాసాధనే తప్ప సిద్ధి ప్రదర్శితం కాలేదు. *

---

* చరణ్‌సింగు దుష్పరిపాలన జనతా పార్టీ ఓటమికి కారణం -

* చరణసింగు దుష్పరిపాలన జనతాని తుడిచిపెట్టినదేకాని లోకదళ్‌ను అంతగా తుడిచిపెట్టకపోవడానికి కారణమేమో? హుందాతనంతో ఓటమికి ఒప్పుకోక నెపం ఇతరులమీదికి త్రోసివేస్తే కొంతమనశ్శాంతికల్గుతుందేమో.

---

# శ్రీనాథుని భాష - అన్యదేశ్యములు

— శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం.ఏ., పిహెచ్.డి.

1_1_0 తెలుగు భాషను చారిత్రికముగా పరిశీలించిన, ప్రాచీన దశలో తత్సమ, తద్భవ పదజాలము ఎక్కువగా చేరినటులు చెప్పవచ్చును. తిక్కనలో అక్కడక్కడ కన్పించినను శ్రీనాథుని కాలమునుండి అన్యదేశ్య పదజాలము మన కావ్యములలో ఎక్కువగా వాడుకలోనికి వచ్చినది. అన్యదేశ్య ప్రయుక్తియందు శ్రీనాథుడు ప్రథముడు కాకపోయినను ప్రముఖుడు. మూలభాష నుండి సంక్రమించినవి దేశ్యములు. తదితరములు అన్యదేశ్యములు. మహమ్మదీయుల పరిపాలన కాలములో అరబ్బీ, పారశీక భాషా పదములు తెలుగువారి రాజకీయ, సాంఘిక రంగములలో వ్యవహారములోనికి వచ్చినవి.

పదుమూడవ శతాబ్దము వరకును జనసామాన్యమునకు అరబ్బీ, పారశీక శబ్దములతో నంతగా పరిచయముకలుగలేదనియే చెప్పవచ్చును. మహమ్మదీయులు అల్లాయుద్దీన్ దండయాత్రతో పదమూడవ శతాబ్దాంతమున దక్షిణ హిందూదేశమున చొరబడిరి. నాటి నుండియు వారి శబ్దజాలము కొలది కొలదిగ తెనుగున ప్రవేశింప మొదలిడినది.

ఆ మహమ్మదీయ పాలకులతో మంచి సంబంధము కలిగి ఉండుటకు కనీసము కొందరుముఖ్యోద్యోగులు వారిరాజభాష అయిన పర్షియను భాష నేర్చుకొనవలసి వచ్చినది. వీరభద్రారెడ్డి మంత్రి అయిన బెండపూడి అన్నయామాత్యుడు (క్రీ. శ. 1420) పర్షియను, అరబ్బీ, టర్కీ భాషలను నేర్చుకొనినాడని శ్రీనాథుడు భీమఖండములో చెప్పెను.

"పారసీకాద్యన్య దేశభాషల నుండి ప్రత్యక్షముగా గాని పరోక్షముగా మరాఠీ భాషాముఖమునగాని తెలుగున శేరిన పదములును. మరాఠీ భాషకు నిసర్గములయి సంసర్గవశమున తెలుగున ప్రవేశించిన పదములును, అన్యదేశ్యము లని పరిమితార్థమున ప్రయుక్తము. శ్రీనాథుని కాలమునాటికే ఉర్దూ ఆలు, చూలు, లేని సోమలింగము. మరాఠ్వాడా - తెలుగునాడులకు గల సంబంధ బాంధవములు ఇక్ష్వాకుల తాతముత్తాతల నాటివి. తెలుగు - మరాఠీలు భౌగోళికముగా పరిసరభాషలు శాతవాహన చక్రవర్తులనాడు ఇంచుమించు నాలుగువందల సంవత్సరములపాటు మరఠ్వాడా, తెలుగునాడును, ఒక గొడుగు క్రింద కలిసిమెలిసి యుండిన విషయము జగమెఱిగిన చరిత్ర"2 తొలి నాళ్లలోని ఆదాన ప్రదానముల మహారాష్ట్రి ప్రాకృతము ప్రముఖపాత్ర వహించినట్లు చరిత్ర. అనాదియును, అవిచ్ఛిన్నమును, అయిన ఇట్టి సమీప సంసర్గ సంబంధము వలన ఈ రెండు ప్రాంతములలోని వ్యవహార భాషలు పరస్పర్శము ప్రభావితమై యుండుట నిర్వివాద విషయము. ఈసంసర్గము కారణముగా తెలుగుపదములెన్నో మరాఠీ వారి నోళ్లలో నలుగుడుపడి వ్యావహారికరూపములుగా కోశముల కెక్కియు పండిత సమ్మతిని బడసి సాహిత్యస్థాయిని సంపాదించియు అక్షరరూపమున చిరస్థాయి పొందినవి.

1_2_0 ఈ దిగువ సూచించినవి శ్రీనాథ ప్రయుక్త అన్యదేశ్యములు. పదపట్టికలోని ప్రధానారోపములు 73 వీని రూపాంతరములు 7. మొత్తము ఆరోపములు 80. కుండలీకరణమునందు వాని రూపాంతరములను కూడ సూచించుటయైనది. వీనిలో పలనాటి వీరచరిత్ర (బాలచంద్రుని యుద్ధము) యందు 16. క్రీడాభిరామమునందు 2, శ్రీనాథుని చాటువులలో 11, ఉపలబ్ధము అగుచున్న కావ్యములలో 41 కలవు.

1-2-1. ఈ క్రింది అన్యదేశ్యములు మరాఠీభాషలో ప్రవర్తితములై తెలుగులో ప్రవేశించినవి. (42)

| | | మరాఠీ | పారసీ | అరబ్బీ |
|---|---|---|---|---|
| 1. | అసలు: (శృ. నై. 6-26 (మూలము) | అసల్, అస్సల్, అసలీ | అస్ల్, అస్లాఫ్, ఇస్లాఫ్ | అస్ల్ |
| 2. | అసివారు: (కాశీ 4-194) (వాహ్యాళి) | అసివార్ | అస్వార్, అసువార్ | — |
| 3. | కమరు : (కాశీ 3-240) (ఒడ్డాణము, మొలనూలు) | కమర్ - కమ్మర్, కంబర్<br>కమర్, బంద్ | కమర్ - నడుము<br>కమర్-బంద్-ఒడ్డాణము | —<br>— |
| 4. | కాకితము3 : (భీమ 1-74) (లేఖ) | కాగద్ | కాఘజ్, కాఘిజ్ | — |
| 5. | కిచ్చడి: (కాశీ 7-185) (నానావస్తువులు చేర్చి వండు చిత్రాన్న విశేషము) | ఖిచడీ, ఖిచిడీ | కిచ్‌రీ | — |
| 6. | ఖర్చు : (ప. వీ 69) (వ్యయము) | ఖర్చ్ | ఖర్చ్ : రొావెల | — |
| 7. | ఖుసి : (పార. పీ 22) (సంతోషము, విలాసము) | ఖుశీ, ఖుశ | ఖుసీ | — |
| 8. | గంజాయి : (శివ 3-62) (మత్తుపదార్థము) | గాంజా | — | — |
| 9. | గాగరా . (చాటువు) (స్త్రీలు కట్టుకొను పావడ) | ఘగ్రా | — | — |
| 10. | గుల్లాము : (గ్రీడా 265) (సేవకుడు/సేవకురాలు) | గులామ్ | గులామ్ | అరబ్బీ |
| 11. | గొంగడి : (చా. మం 1-128) (కంబళి) | ఘొంగ, ఘొంగడీ | — | — |
| 12. | గోవ (శృ. నై 6-120) (పశ్చిమ తీరమున గల రేవుపట్టణము) | గోవేఁ | — | — |
| 13. | చబుకు4 : (ప. వీ 119) (కొరడా, చేతికోల) | చాబూక్ | చాబుక్ | — |
| 14. | చామలా : (ప. వీ 72) (ఒక రకమైన కడియము) | శామల్ | — | — |
| 15. | చావడి : (ప. వీ 28) | చావడీ | — | — |
| 16. | చికిలి : (కాశీ 1-121) (మెఱుఁగు, పదను) | సికల్ | సక్కాల్ | సక్ల్ |
| 17. | జబ్బు : (శ్రీ. నా. చాటువు) (మందము) | జబూన | జబ్బ | — |
| 18. | డమామి : (ప. వీ 4) (డిండిమము) | ఢమామి | — | — |

| | మరాఠీ | పార్సీ | అరబ్బీ |
|---|---|---|---|
| 19 డేరా : (ప. వీ 36) (గుడారము) | డేరా | — | — |
| 20. తాయెతు: (ప:వీ 17) (మెడనో, మొలనో కట్టుకొను రక్షాధూప) | తావీజ్ | త'వీజ్ | తఅవీజ్ |
| 21. తేజీ : (శృ. నై 6-96) (మేలుజాతి గుఱ్ఱము) | తేజీ | తాఝీ, తేఝ్, తాజీ | — |
| 22. త్రాసు : (భీమ 2-77) (తుల) | తరాజు | తరాజూ | — |
| 23. తుర్కు : (క్రీడా 149) (తురుష్కజాతీయులు) | తుర్క | తుర్క్ | — |
| 24. దుకాణము : (శ్రీ.నా.చాటువు) (అంగడి) | దుకాణ్/న్ | దుకాన్, దుక్కాన్ | దుక్కాన్ |
| 25. పరాకు : (శృ. నై. 5-106) (ఉపేక్ష) | పరాఖ్ | — | — |
| 26. పారసి : (భీమ 1-74) (పారసీ భాష) | ఫారశీ (సీ) | — | — |
| 27. పేషణి : (శృ. నై 1-32) (దూత) | పేషణ | — | — |
| 28. పౌజు (ప. వీ 114) (సేన, పటాలము) | ఫౌజ్ | ఫౌజ్ | ఫౌజ్ |
| 29. బరాబరి . (ప. వీ 15) (ప్రభు దర్శనము నిమిత్తము గుమిగూడు ప్రజలను బగళీము చేసి ఎచ్చరిక తెలుపుట) | బరోబర్ | బరో ఆబర్ | — |
| 30. బాకు (ప.వీ 2) (కత్తి) | బాక్ | — | — |
| 31. బిబ్బి . (శ్రీ. నా. చాటువు) (తురుష్కుల యంతఃపుర స్త్రీ) | బిబి | ఓపి సత్కుల ప్రసూతయగు స్త్రీ | టుర్కీ |
| 32. బొందిలి : (చాటువు) (బొందిలీజాతి) | బుందేల్ | — | — |
| 33. మొళము : (శృ. నై 6-94) (వెండి, బంగారము, లోనగు వానిపై పూత) | ములామా ములమ్మా | ములామ్మా | ములమ్మఅ |
| 34. రావు: (శ్రీ.నా. చాటువు) (నాటి వెలమదొరల పట్టపు పేరు) | రావో | — | — |
| 35. రోజు . (ప. వీ 42) (దినము) | రోజ్ | రోజ్ | — |
| 36. లుంగ : (క్రీడా 42) (వస్త్రభారము, బట్టల మోపు) | లుంగి | లుంగ, లుంగీ | — |
| 37. సమ్మాను : (క్రీడా 42) (ముక్కోణ్య పడవ) | సామాన్ | సామాన్ | — |

| | మరాఠీ | పారసీ | అరబీ |
|---|---|---|---|
| 38. సరిహద్దు · (ప. పీ 33) (పరిమితి, మేర) | సర్ హద్ద్ | — | — |
| 39. సహా : (హార. పీ 24) (చక్రవర్తి) | శహా | షహ్ | — |
| 40. సొగటాలు . (ప. పీ 45) (జూదమాడెడు సారెలు) | సొగడీ, సొగడా | — | — |
| 41. సెబాసు (హార 7-64) (మెచ్చికోలను తెలుపుమాట) | శాబాస్ | షహ్-బాష్ | — |
| 42. హద్దు (ప. పీ 33) (అవధి) | హద్ | హద్ | హద్ |

1-2-2. ఈ క్రింది అన్యదేశ్యములు పారసినుండి తెలుగులో ప్రవేశించినవి. (17

| | పారసీ | అరబీ | మరాఠీ |
|---|---|---|---|
| 1. అపరంజి . (క్రీ. పీ 62) (పుటము పెట్టిన బంగారము) | అఫ్ రంజ్, అఫ్ రంజీ | అప్ రంజియ | — |
| 2. అరబీ : (భీమ 1-73) (అరబ్బీదేశపు భాష) | అరబ్ | — | — |
| 3. ఖత్తలాని · (శృ. నై 6-96) (ఖత్లానదేశపు గుఱ్ఱము) | ఖత్ లాన్ | ఖత్ ల్ | — |
| 4. కుల్లా 7 (శ్రీ. నా. చాటువు) (పట రచిత మకుటము) | కలాహ్ | — | — |
| 5. గసగస : (భీమ 3-57) (ఒక దినుసు మసాలావిత్తులు) | ఖష్ ఖాష్ | — | — |
| 6. జరి (శశి 2-90) (వెండి బంగారముల మొలాము) | జర్ | — | — |
| 7. జరిపోసనము · (కాశీ 6-161) (బంగారు పైపూత) | జర్ పోష్ | — | — |
| 8. పంజు . (హార 7-137) (ప్రకాశించు, రత్నములు చెక్కిన ప్రకాశము) | పంజ్ | — | — |
| 9. బాజారు: (శ్రీ. నా. చాటువు) (విపణివీథి యందలి జనము) | బాజార్ | — | — |
| 10. మసీదు (క్రీడా 149) (ముస్లిముల ప్రార్థనామందిరము) | మస్ జిద్ | మస్ జిద్ | — |
| 11. ముఖమల్లు 9 (ప. పీ 17) (ఒత్తుగా మెత్తగా నుండు ఒక తరహా పట్టుగుడ్డ) | మఖ్ మిల్ | — | — |
| 12. మైజారు: (శ్రీ.నా. చాటువు) (పైటకొంగు) | మి'జర్ | — | — |

| | మరాఠీ | పారసీ | అరబ్బీ |
|---|---|---|---|
| 13. లాహిరి : (కాశీ 2_138) (మాదకద్రవ్య సేవనము) | లహిర్ | — | — |
| 14. సన్నాయి : (ప. వీ 4) (నాగసరము) | షాహ్‌నామ్ | — | — |
| 15. సురతాణ: (కాశీ 6.309) (పాలకుడు) (సురతాణి, సురత్రాణ, సురధాణి, సురథ్రాణ10 సురధాని) అను రూపాంతరములు కలవు. | సుల్తాన్ | సుల్ తాన్ | — |
| 16. హజారము (కాశీ 1_135) (అస్థానము) | హజిరాన్ | — | — |
| 17. హురుముంజి (హర. వీ 7) (పారసీక జలసంధి చేరువ తీరమున గల పెద్ద రేవుపట్టణము) | హుర్ ముజ్ | — | — |

1_3_0 వర్ణనిర్మాణాత్మక రూపాంతరత (Phonological Variations) చెందిన అన్యదేశ్యములు కొన్నింటిని ఉదాహరింతును.

1_3_1 స్వరవిశ్లేషము (Anaptyxis)

అసివారు _ అస్వార్
కత్తలాని _ ఖల్లాన్
కిచ్చడి _ కిచ్‌రీ.

1_3_2 మధ్యమ స్వరలోపము (Loss of medial syllable)

త్రాసు _ తరాజు

1_3_3 మూర్ధన్యీకరణము: (Retro flexion)

మోళము _ ములమ్మా
సురధాణి _ సుల్తాన్

1_4_0 సమాసములలో నొకయంగము అన్యదేశ్య ముండుట కలదు.

1_4_1 అన్యదేశ్యము + తత్సమము
తేజీ _ హయము (శృ. నై 6 96)
పేషణి _ హనుమంత (శృ. నై 1.3.)

1_4_2 అన్యదేశ్యము + తద్భవము
పంజు _ మంచము (హర 7_137)
(పైడి) మోళము _ కటారి (శృ. నై 6 94)

1_4_3 తత్సమము + అన్యదేశ్యము
వజీరిల _ కమరు (శివ 2_26)

1_4_4 దేశ్యము + అన్యదేశ్యము
పసిడి_జలపోసనము (హర 5_56)
పైడి _ మోళము (శృ. నై 6-94)

1_4_5 తమిళము + తత్సమము
తిరు _ నామము (శ్రీ. నా. చాటువు 132) తిరు _ పతి (కాశీ 5_288)

(సశేషం)

---

1. భీమఖండము. 1_73.

2 టి. దొణప్ప : భాషా చారిత్రక వ్యాసావళి, పుట 197.

3. సంస్కృతమున 'కాఘజ్' పారసి మూలకముగా మోనియర్ విలియమ్స్‌చే ప్రదర్శితము.

4. చబుకు గ్రామ్యమని, పారసి జన్యమని _ కాంబెల్ _ పుట 224.

5. త్రాసు దేశ్యమని బ్రౌణ్యము _ పుట 467

6. పూర్వ ముద్రణ పాఠములను, తాళపత్ర ప్రతుల పాఠములను, బరిశీలింపగా కత్తులాణ, కర్తలాణ, కత్తలాని, కత్తులాని అను పాఠాంతరములు ముద్రిత గ్రంథములందును, ఖత్తులాణి, ఖత్తులాణ, అను పాఠాంతరములు తాళపత్ర ప్రతుల యందును కలవు. ఖత్తులాణము అను రూపాంతరమును గలదు.

'కత్తులాని' 'ఖత్తులాణ' ఘటితములే మూలపాఠము లనియు, బ్రౌనుదొరగారొసంగిన వ్యుత్పత్తి సుసంగత మనియు, కర్తలాణ శబ్ద నిర్వహణకు త ర క ర్త మార్చిన నైషధీయ పాఠ మగ్రాహ్యము.

7. కుల్లాయి, కుళ్ళా (యయి) పదము లర్వాచీన సాహిత్యమున విరివిగా ప్రయుక్తములు.

8. నల్లమందు విత్తులు అని ఆంధ్ర పద పారిజాతము _ పుట 184.

9 ముఖమాలు అను రూపాంతరము కలదు.

10. ఈ రూపాంతరము లన్నియు వాస్తవముగా నాటి వ్యవహారాను గుణములో లేక లేఖక ముద్రాపక కల్పితములో నిర్ధారించుట దుస్సాధ్యము.

—...—

# * ఫలితం *

ఎన్నికలు ముగిసినవి. రాజకీయ నాయకుల అంచనాలు (తుదకు శ్రీమతి ఇందిరా గాంధీ అంచనా కూడా) తారుమారయినవి. రమారమి మూడింట రెండువంతుల మెజారిటీతో కాంగ్రెసు ఐ ఊహించనంతగా విజయం సాధించింది. జాతీయపార్టీలయిన జనతా, కాంగ్రెస్ (యు); ప్రాంతీయ పార్టీలు ఆల్ ఇండియా అన్నా డి.ఎం.కె, అకాలీదళ్ పార్టీలు, నామరూపాలు శిష్టము లైనవి. శ్రీ చరణసింగు లోకదళ్ ఈ ఎలక్షనుకు పూర్వము ఉనకు గల స్థానాలలో సగానికి మించిన స్థానాలను నిలుపు కున్నది. మార్క్సిస్టు కమ్యూనిష్టు పార్టీ తన బలాన్ని బాగా పెంచుకొన్నది.

నిరంకుశ - అవినీతియుత - పరిపాలన సాగించినట్లు భావింపబడి 1977 లో చిత్తుగా ఓడింపబడిన కాంగ్రెసు ఐ ఇంతగా విజయం సాధించడంలోను ప్రజాస్వామ్య పరిరక్షకులు అని పేరొందిన జనతాపార్టీ ఇంత చిత్తుగా ఓడిపోవడంలోనూ గల రహస్యం ఏమిటి ?

అందరికీ తెలిసిన పరమ రహస్యం. జనతాపార్టీలోని అంతఃకలహాలు, తత్కారణంగా కుంటుపడిన - అసమర్థ-పరిపాలన, క్రమశిక్షణ రాహిత్యం, శాంతిభద్రతల లోపం అనేవి ముఖ్యాంశాలు. అధికారాన్ని దుర్వినియోగం చేసి అయినా పొందవేని చేతకానితనం కూడా ఒక కారణం కావచ్చును.

మహామేధావులయిన జనతా నాయకులు 1977 లో తమకు లభించిన విజయమంతా తమ స్వప్రతిభయే అని అతిగా భావించారు. ఇందిరా వ్యతిరేక భావమే తమ విజయానికి కారణమనే స్ఫురణ కొంచెం వున్నా అది హృదయగతం కాలేదు. లేదా ఆ వ్యతిరేక ప్రభంజనం శాశ్వతంగా ఉంటుందని భ్రమించడం జరిగింది.

సుమారు ఈ రెండున్నర సంవత్సరాలలోను కాంగ్రెస్ ఐ ప్రజాభిమానాన్ని చూరగొనేందుకు చేసిన మహాకృషి యేమీ కనబడదు. 1977 లో తనమీద ప్రజానీకానికి కలిగిన ఏహ్యభావమూ, వ్యతిరేకతా ద్విగుణంగా త్రిగుణంగా జనతా మీద కలగడమే నేను ఐ కాంగ్రెసుకి కలిగిన అఖండవిజయానికి ముఖ్య కారణము. అసమర్థపాలన కన్న నిరంకుశ పాలనయే కొంతవఱకు మేలన్న భ్రాంతియీ ఫలితానికి కారణం.

ఈ బహిరంగ రహస్యాన్ని జీర్ణించుకోలేక చరణ్ ప్రభుత్వ దుష్టపరిపాలనమే జనతా ఓటమికి కారణమనీ, జనతా లోకదళ్‌ల భేదం గుర్తించలేనిఓటరుల మౌఢ్యమే కారణమనీ పరనిందా ప్రచారానికి ప్రారంభోత్సవం కావించారు ప్రధాని పదవిని ఆసించి ఆశాభంగం పొందిన వృద్ధ నాయకులు శ్రీ జగజీవనరామ్ తుంటి మీద కొడితే పళ్ళురాలిన వన్నట్లుంది ఈ వాదం. చరణ్ దుష్టపరిపాలన జనతాను తుడిచిపెట్టి లోకదళ్‌ని కొంతవఱకైనా గెల్పించడం ఎలా సమర్థనీయమో !! ఆలోచించలేనితనం కాదా యిది ?

జనతా నాయకుల ఇట్టి పేలవపు వాగ్జాలం ఆ పార్టీని అంత నికృష్టంగా ప్రజానీకం గణించడానికి ప్రధాన కారణాలలో ఒకటి. దేశానికి అత్యంత గౌరవప్రదమైన అధ్యక్షపదవిని అధిష్ఠించియున్న శ్రీ సంజీవరెడ్డిని పక్షపాతి, రాజ్యాంగ విరుద్ధ ప్రవర్తకుడు, అని నిందించి; జనతా విజయంతో ఆయన పదవీ పరిత్యాగం చెయ్యాలని జనతా నాయక ముఖ్యులు ఎలుగెత్తి ఘోషించడం ఆ పార్టీ యెడల ఓటరులకి గౌరవభావం కలిగించలేదు కదా వ్యతిరేకభావమే కల్గించిందనడం నిస్సందేహం.

అన్నిటిమాటా అటుంచి "పార్టీ గెలిస్తే శ్రీ జగజీవన్ రామ్‌నే ప్రధానిగా చేసాం. రాం ప్రధాని కావాలంటే జనతాకే ఓటివ్వండి" అనే ప్రచారం జనతాకి కలిగించిన హాని ఇంతం తనరానిది. ఈ తారకమంత్రంతో హరిజనుల ఓట్లన్నీ తమవే అవుతాయని భావించడం జరిగింది. హరిజన వోట్లవిషయంలో దీనివలన అనుకున్న ప్రయోజనం కలగకపోగా హరిజనేతర ఓట్లు అత్యధిక సంఖ్యలో నష్టము మడానికి మంత్రం దోహదంచేసిందనేది సత్యదూరం కానేరదు.

1977లో తమ పార్టీ అధిక పరాజయానికీ, ఈ నాటి ఎన్నికలలో జనతా సంపూర్ణ పరాజయానికీ, కారణములయిన దోషాలన్నిటినీ దూరంగా నెట్టివైచి, ప్రభుత్వాన్ని విజయపథంలో నడపగల సామర్థ్యం శ్రీమతి ఇందిరాగాంధికి కలదనడంలో సందేహంలేదు. అశేష భారత ప్రజానీకం తనపై ఉంచిన విశ్వాసానికి తన ఉత్తమ పరిపాలనతో సమాధానమీయగల రాజకీయ వివేకం ఆమె పుష్కలంగా కలిగిఉన్నదని భావింపవచ్చును. 1977 పునరావృత్తమౌతుందని ఎవరైనా భావిస్తే వారికి ఆశాభంగమే ఎదురు కాగలదు.

లోకదళ్, జనతా, యు కాంగ్రెసు మొదలయిన ప్రతిపక్షాలు వీలయినంత సమైక్యంగా ఉండి, జాతీయ సమస్యలపై నిర్మాణాత్మక విమర్శలు చేస్తూ, ప్రభుత్వంతో సహకరించడం రూపంగా ప్రజాసేవ చేయడమే వాటి ప్రస్తుత కర్తవ్యం. మార్క్సిస్టు కమ్యూనిష్టుపార్టీతో సిద్ధాంతపరమైన భేదాభిప్రాయాలు ఎవరికి ఏలా వున్నా అత్యంత క్రమశిక్షణాయుతమైన పార్టీ నిర్మాణం కలిగి తమ బలాన్ని గణనీయంగా ఆపార్టీ పెంచుకొన్న దనడాన్ని ఎవరూ కాదనజాలరు. శ్రీమతి ఇందిర సుస్థిర పరిపాలన దేశ క్షేమదాయకమై విలసిల్లవలెననేది నేటి భారతదేశ ప్రజానీక పరమాకాంక్ష. - సంపా॥

# గ్రంథ సమాలోచన

## శ్రీ దుర్గా సప్తశతి

(శ్రీ దుర్గా యంత్రరాజ శ్రీ రాజ రాజేశ్వరీ పూజా విధాన సహితము)

(రచయిత - పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు. అధ్యాత్మ ప్రచారక సంఘము జయశ్రీటాకీస్ రోడ్ - రాజమండ్రి - 4 వెల. 2 రూ)

వైజ్ఞానిక శక్తి కతీతమగు నవ్యక్త రూపమును పలువు రాస్తికులు పలు విధముల నుల్లేఖించిరి. జగద్గురు ప్రభృతులు షణ్మతములను వివరించిరి. ఇట్టి వానిలో శాక్తేయ సిద్ధాంత మొకటి. ఆమతమున దుర్గాసప్తశతి ప్రముఖము. ఆర్షములగు నిట్టివాని యనుసంధానము పారాయణ శ్రద్ధధానులగు ఆస్తికుల కైహికముగ మానసికముగ బహుధా దృష్టఫలము. ఇట్టి యార్షముల కనుసంధానాదికమే కాని యనువాద ముచితము కాదనిపించును. ఇట్టివాని యనువాదము కేవలము తద్గతవిషయ పరిజ్ఞానమున కుపయోగింపవచ్చును.

ఇట్టి యాస్తిక బుద్ధితో శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తిగారు (అధ్యాత్మప్రచారక సంఘము) దుర్గా సప్తశతి సారాంశమును (కథా భాగమును) ఆంధ్ర భాషలో ప్రకటించిరి. మూలశ్లోకమును భావమును వరుసగాకలిపి ముద్రించినచో పాఠకుల కుపయోగకరముగ నుండెడిది. మరియు దుర్గాసప్తశతీ పారాయణ క్రమ విధానములను వివరించినచో మరింత యుచితము గానుండెడిది. దీని ముద్రణకు పలువు రాస్తికులు ధార్మికులు బహుధా సాయపడిరని గ్రంథము నందలి ప్రకటనాదుల వలన దెలియుచున్నది. ఇట్టి యవకాశమున్నప్పుడు దీనిని సర్వతోముఖముగ ననవద్యముగ దీర్చిదిద్ద వీలుకలిగినది. కాని యాసౌకర్యము సముచితముగ నుపయోగింపబడలే దనిపించును.

ఈ గ్రంథము ఆస్తికులగు పామరులకే యుద్దిష్టమైనను నిట్టివానియందలి భాష నిర్దుష్టతను ఒకానొక ప్రత్యేకతను సంతరించుకొనవలసియున్నది. ఉదాహరణకు - శ్రీ వేలూరివారి మహాత్ముని ఆత్మకథ, శ్రీ శ్రీనివాసశిరోమణి రామాయణము గ్రాహ్యములు. గ్రంథమందలి భాషలో నిర్దుష్టతయే లోపించిన దనవచ్చును. చేసుకొనుచు, గ్రస్థులై, (19) ధనుర్బాణధారియై జగన్మాత(34)ఘోరరక్కసులు (21) రక్కసాధములు (26) తపోశక్తి (28) మత్తరాయంచలు (26) వంటి పదముల సాక్షాత్కారము దీని కుదాహరణగా జూపవచ్చును. ముద్రారాక్షసములును నిందు కానవచ్చును.

దీని కనుబంధముగ శ్రీ రాజరాజేశ్వరీ పూజావిధానము కూడ కలదు. ఇందును 'రాక్షసాం' (రక్షసాం అనుటకు) అసర్పంతు (అప సర్పంతు అనుటకు) వంటి స్ఖాలిత్యములు కలవు. విశేషించి పూజావిషయమున నిట్టివాని విషయమున జాగరూకత యవసరము. పామరుల కీయర్థస్ఖాలిత్యము పట్టదు. కావున గమనింపరు. ఇట్టిచో దీనివలన లాభమెంత? నష్టమెంత? యని బేరీజు వేయవలసివచ్చును. ఈ పూజా విధానమున న్యాయాస్థలముల కొంతవివరణ నిచ్చిన బాగుండెడిది. మరియు దీని కనుబంధముగ శ్రీ రాజరాజేశ్వరీ నామాదుల నిచ్చినచో నాస్తికులగు పాఠకుల కీ గ్రంథము పూజకను సాయపడెడిది. దీని విషయమున కొంత శ్రద్ధను చూపినచో చాల బాగుండెడి[...]

ఏమైనను నిట్టివాని ప్రకటన వా[...] దాయకము ప్రశంసనీయమునైనను, దీ[...] కాస్తికుల తోడ్పాటు, ప్రకాశకులకు నిర్దుష్టముగా దీర్చు నవకాశము, కల్గినపుడ సక్రమముగా వినియోగించుకొనక పోవుట కొంత బాధాకరము. శ్రీ రాధాకృష్ణమూర్తిగారి ప్రయత్నము ప్రశంసనీయము 48 పేజీల యీ గ్రంథము రెండురూపాయలనుట మిక్కిలి యెక్కువనిపించును.

- శ్రీ ప్రసన్న.

—…—

---

1. కృష్ణాజిల్లా గ్రామనామాలు
2. దేవయాని
3. డా. చి॥ నారాయణరావుగారి ముసలమ్మపదం
4. జాషువా గబ్బిలము వస్తుశిల్ప విన్యాసము
5. ప్రౌఢభావ సరస్వతి రాళ్లపల్లి
6. సౌందర నందము సాహితీతీర్థము
7. సాహిత్యము దాని ప్రభావము
8. శ్రీకృష్ణ నిర్యాణం ఒక ఎలజీ
9. ఆధునిక తెలుగు నవలాపరిణామం
10. 'ఏకవీర' ఇతివృత్తి పరిశీలన
11. హనుమన్నాటకము - అంగదుడు
12. ఏటికోళ్ళ కవితా సమీక్ష
13. ఏకవీర దాని వైశిష్ట్యము
14. తెలుగువారు ప్రాకృత భాషా సేవ
15. తెలుగులో చిత్రకవిత్వము
16. శ్రీనాథుని పదకల్పములు
16. శ్రీమదాంధ్ర రామాయణము - యో: దర్శనము

* పై రచనలు పరిశీలింపబడి ప్రచురణకు అంగీకృతములై మాయొద్ద నున్నవి. వీలయినంత త్వరలో ప్రచురించబడునని మనవి. సం॥

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispet, (Tyagaraja Nagar) Rajahmundry-1.